జనవరి 2018

గణతంత్ర దినోత్సవ శుభాకాంక్షలు



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.30/-

సంపూర్ణమైన జీవితం గడపడం, స్వదేశీ

సహాయ నిరాకరణ, సత్యాగ్రహము

సత్యం, అహింస



1930 ఉప్పుసత్యాగ్రహం. దండియాత్ర

1921 స్వరాజము

1919 రౌలట్ చట్టం సత్యాగ్రహం

1918 చంపారణ్, ఖేడా సత్యాగ్రహము

Adavi

Ci




సంపుటి: 4 సంచిక: 1 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. జనవరి 2018



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్‌లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక






ముఖచిత్రం: మహాత్ముడు

చిత్రకారుడు: సి.రాము

కొత్తపల్లి 96 వ పుస్తకం!

# సుభాషితమ్

క్షీరేణాత్మగతోదకాయ హి గుణా దత్తా: పురా తే ఖిలా
క్షీరోత్తాపమవేక్ష్య తేన పయసా స్వాత్మా కృశానౌ హుత:।
గంతుం పావకమున్మనస్తదభవ ద్దృష్ట్వాస్తు మిత్రాపదం
యుక్తం తేన జలేన శామ్యతి సతాం మైత్రీ పునస్త్వీదృశీ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

పై శ్లోకాన్నే ఏనుగు లక్ష్మణ కవి
ఎంత చక్కగా తెలుగు చేసారో చూడండి!

క్షీరము మున్ను నీటికొసగెన్ స్వగుణంబులు దన్ను జేరుటన్;
క్షీరము తప్తమౌటగని చిచ్చురిజెన్ వెతచే జలంబు; దు
ర్వార సుహృద్విపత్తిగని వహ్ని చొరంజనె దుగ్ధ; మంతలో
నీరముగూడి శాంతమగు, నిల్చు మహాత్ముల మైత్రి ఈ గతిన్

ఇది పాలు-నీళ్ళ స్నేహపు కథ: మొదట పాలు ఏం చేసాయటంటే, తన మంచి గుణాలను ఆ నీళ్లకు కూడా ఇచ్చి, వాటితో స్నేహం చేసుకుంటాయట.

అప్పుడేమౌతుంది, మనం ఆ పాలను వేడి చేస్తాం కదా, అది చూసి బాధ పడ్తాయట, నీళ్ళు: "హుం.. ఇంత మంచి నా మిత్రుడిని ఇంత కష్టపెడుతుందా, ఈ మంట! దీని పని చెబుతాను!" అంటూ ఆ నీళ్ళుకాస్తా మంటమీదికి దూకబోతాయట.

"అయ్యో! నాకోసం నీళ్ళు ఎంత ఆపదకు లోనౌతున్నాయి!" అంటూ పాలు తనకుతానే మంటలోకి ఉరుకుతాయట.

అప్పుడు మనం ఏం చేస్తాం? కొన్ని నీళ్ళు చిలకరిస్తాం! అప్పుడు "ఓహో! నా మిత్రుడికి ఏమీ కాలేదులే!" అని సంతోషపడి, పాలు శాంతిస్తాయి!

మంచి స్నేహితులు పాలు-నీళ్ళ మాదిరి, అట్లా ఒకరికొకరు తోడుగా ఉంటారన్నమాట!

# నిమ్మరసం



1947, ఆగస్టు 15. ఢిల్లీలో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు జరుగుతున్నాయి. అటు కలకత్తాలో హిందూ ముస్లిం అల్లర్లు జరుగుతున్నాయి.

'ఇదేమి స్వాతంత్ర్యం?! నాకు ఇట్లాంటి స్వాతంత్ర్యపు వేడుకలు అక్కర్లేదు' అనుకున్నాడు గాంధీజీ. పోయి కలకత్తాలో బస చేశాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే దుండగుల గుంపు ఒకటి గాంధీ మీదికి దాడి చేసింది. గాంధీ ఉన్న ఇంటి తలుపులు, కిటికీలు, ఇంట్లోని కుర్చీలు, సోఫాలు- అన్నీ ధ్వంసం చేసింది. గాంధీ మీదికి ఇటుకలు విసిరింది. అంత ప్రాణాపాయ స్థితిలో కూడాను, గుంపులోని వాళ్లందరితోటీ మాట్లాడాడు గాంధీజీ. చివరికి అందరినీ శాంతపరచి వెనక్కి పంపించాడు!

"కలకత్తాలో ముస్లిములందరూ తూర్పు పాకిస్తాన్ దేశానికి వెళ్ళిపోవాలి!" అని హిందువుల డిమాండు. "మేం ఇక్కడే ఉంటాం-మీకు నచ్చకపోతే మీరే వెళ్ళిపోండి!" అని ముస్లిములు. ఇద్దరిలోనూ విద్వేషాగ్నులే.

బెంగాల్ ప్రజల్లో ఆ విధంగా ఎగసి పడుతున్న వైషమ్యాల మంటలు గాంధీజీకి చాలా బాధ కలిగిస్తున్నాయి. "ఇందుకేనా, మనం అందరం కలిసి బ్రిటిష్ వారితో పోరాడింది? ఇట్లా కొట్టుకునేందుకేనా? కలిసి ప్రశాంతంగా ఉండలేమా? తప్పులెన్నుకుంటూ అరాచకత్వానికి తెర తీసేందుకేనా, మనం స్వరాజ్య సమరం నెరపింది?" అని నిరాశా భరిత ఆలోచనలు.

"బెంగాల్లో ఇల్లిల్లూ తిరిగి చెప్పాలని ఉంది: 'ఈ వైషమ్యాలను వదిలేయండి. మళ్ళీ ఒకసారి కలిసి జీవించండి!' అని. కానీ ఇప్పుడది నావల్ల కావట్లేదు. ముసలివాడిని అయ్యాను. మనకు స్వతహాగా శక్తి లేనప్పుడు, శక్తి ప్రదాత అయిన భగవంతుడిని ప్రార్థించాలి. ఉపవాసం ద్వారా ఆ భగవంతుడిని సేవిస్తాను. విషమ పరిస్థితి తొలిగేంతవరకూ నేను నీళ్లు, సోడా, నిమ్మరసం తప్ప మరేమీ స్వీకరించను" అంటూ నిరాహార దీక్ష మొదలుపెట్టాడు గాంధీజీ.

ఆ సమయానికి రాజాజీ బెంగాల్‌కు గవర్నర్‌గా ఉన్నారు. "గొడవలు ఎట్లాగైనా సద్దు మణుగుతాయి. గాంధీజీ నిరాహార దీక్ష చేయడం అనవసరం" అని ఆయన అభిప్రాయం. ఎలాగైనాసరే గాంధీతో నిరాహార దీక్ష మాన్పించాలని పట్టుదలగా వచ్చాడాయన.



తను నిరాహార దీక్ష ఎందుకు చేస్తున్నాడో చెప్పుకొచ్చాడు గాంధీ; అది ఎందుకు అవసరంలేదో చెప్పుకొచ్చాడు రాజాజీ. ఒకరి మాట ఒకరు వినే అవకాశం ఇద్దరికీ లేదు.

చివరికి రాజాజీకి చికాకు వేసింది. "నిరాహార దీక్ష అంటున్నావ్; ఇంక మళ్లీ ఆ నిమ్మరసం మాత్రం ఎందుకు?!" అనేసాడు.

గాంధీ ప్రశాంతంగా తన సెక్రెటరీ నిర్మల్ బాబు వైపు చూసాడు. "నా ప్రకటనని సరి చూసానన్నావు; మరి అప్పుడు నీకు ఈ విషయమే తట్టలేదా?! ఈ రాజాజీగారికి నేను చాలా కాలంగా పరిచయం కాబట్టి, ఆయన గుర్తుపట్టగలిగారు, నా శరీరం ఇంకా ఎంత గట్టిగా ఉందో! అసలు ఆ నిమ్మరసం మటుకు నాకెందుకు? అది కూడా అక్కర్లేదు. నేనిప్పుడు కేవలం సోడా, నీళ్ళు మాత్రమే త్రాగుతూ నిరాహార దీక్ష చేస్తాను!" అంటూ తను స్వీకరించే

పదార్థాల లిస్టులోంచి నిమ్మరసాన్ని కూడా కొట్టివేసాడాయన!

"అరే! పుణ్యానికి పోతే పాపం ఎదురైందే! ఏం చేస్తాం?!" అనుకొని ఊరికే పోయాడు రాజాజీ.

మరో వారానికి బెంగాల్ లో గొడవలు కాస్తంత సద్దు మణిగాయి.

గాంధీ మొండితనం, ఎన్ని కష్టాలు ఎదురైనా సరే, తను నమ్మిన సత్య మార్గం నుండి చలించని స్థైర్యం, స్వీయ ప్రవర్తనలో నిజాయితీ, సామాన్యుల పట్ల ప్రేమ, ఇవన్నీ ఆయన్ని ప్రజలకు దగ్గర చేసాయి.


GANDHIJI SHOT DEAD

ASSASSINATED WHILE ON WAY TO PRAYER MEETING

NATION PLUNGED IN MOURNING

సమస్యల్లా సామాజికమైన సమస్యలకు పరిష్కారాలను ఆయన తన వ్యక్తిత్వం ద్వారా కనుగొనేందుకు ప్రయత్నించటం. ఆ క్రమంలో గాంధీజీ అనేకసార్లు ప్రాణాపాయ స్థితిని ఎదుర్కొన్నాడు. "హిందువులు, ముస్లిములు, ఇతర మతాల వాళ్ళు అందరూ కలిసే ఉండాలి, పరస్పర నిందలు వద్దు" అనే ఆయన కడదాకా నమ్మాడు. చివరికి 1948వ సంవత్సరం జనవరి 30న, "నువ్వు మన దేశానికి హిందూ రాజ్యాంగం రాకుండా అడ్డుకుంటున్నావు. ముస్లిములను వెనక వేసుకొస్తున్నావు" అంటూ మతవాది గాడ్సే ఆయన్ని తుపాకీతో కాల్చేసాడు.

మత సహనానికి ప్రతీక గాంధీజీ. మనకు ఎన్ని అసౌకర్యాలు ఎదురైనా సరే, వాటినన్నింటినీ పరిష్కరించుకుంటూ, అందరం శాంతి సామరస్యాలతో కలిసి జీవించటం; భిన్నత్వంలో ఏకత్వాన్ని నిలుపుకోవటమే ఆయన స్మృతికి మనం ఇచ్చే అసలైన నివాళి.

నూతన సంవత్సరంలో మనం అందరం సుఖశాంతులతో, పరస్పర ప్రేమాభిమానాలతో వర్ధిల్లుతామని ఆశిస్తూ,

కొత్తపల్లి బృందం



# తాతమ్మ పళ్లు

బిట్టు కథలు

ఢిల్లీలో ఉండే బిట్టు సెలవల్లో అమ్మమ్మ ఊరు పోరంకికి వచ్చాడు. అక్కడ తాతయ్య వాళ్ళ అమ్మ- 'తాతమ్మ' కూడా ఉంది. బిట్టుకు తాతమ్మని చూస్తే ఆశ్చర్యం. మరి తాతమ్మ ఎప్పుడూ పళ్ళు తింటుంది!

రచన: శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, విజయవాడ.

తాతమ్మ కబుర్లు చెబుతుంది, కానీ బిట్టుకి మటుకు ఆ కబుర్లు అన్నీ అర్థం కావు.

వాడికి చాలా అనుమానాలు: 'ఆవిడ తాతయ్య దగ్గర చంటిపిల్లలా ప్రవర్తిస్తుందేమిటి? తాతయ్యకి అమ్మ కదా, అయినా అన్ని విషయాలు తాతయ్యనే అడుగుతుంది ఎందుకు? చేతికర్ర ఉన్నది కదా, అయినా తాతయ్య చెయ్యి పట్టుకుని నడుస్తుంది ఎందుకు?

చేతికర్ర ఎప్పుడూ వదలదేమి? చిన్నపిల్లలాగా తప్పటడుగులు వేస్తుంది ఎందుకనో? ఒక్క పన్నూ లేదు; అయినా ఎప్పుడూ నోరు కదుపుతూనే ఉంటుంది- ఏం తింటుంది, అస్తమానూ?' అని బిట్టుకి ప్రశ్నలు.

అయినా తాతమ్మని అడగలేదు. 'అడిగితే ఏమనుకుంటుందో!' అని అనుమానపడ్డాడు వాడు. 'చిన్నప్పుడు చాలా ఎక్కువ స్వీట్లు తినేసి ఉంటుంది! అమ్మ చెబుతుందిగా, 'స్వీట్లు ఎక్కువ తింటే పళ్లు పాడైపోతై; ఊడిపోతై' అని; బహుశ: తాతమ్మకి ఎవ్వరూ చెప్పలేదేమో, ఆ సంగతి!'

ఒక రోజు తాతమ్మ మరీ వింతగా చేసింది. "నాకు అన్నం తినాలని లేదురా, నిద్రవస్తోంది" అని చెప్పేసి, అట్లాగే పడుకొని నిద్రపోయింది. అమ్మమ్మ వచ్చి ఎన్నిసార్లు లేపినా లేవదు! "నన్ను లేపకే మణీ! నాకు ఆకలి వేసినప్పుడు లేచి తింటాను. మీరంతా తినెయ్యండి!' అనేసి ఒత్తిగిలి, మరోప్రక్కకి తిరిగి, పడుకుంది.

'ఆరోగ్యం బాగాలేదో, ఏమో. మనం తినేద్దాం. సాయంత్రానికి కూడా లేవకపోతే అప్పుడు తాతయ్య డాక్టరును పిలుచుకువస్తారు' అంది అమ్మమ్మ.

మధ్యాహ్నం అందరూ భోజనాలు చేసి, పడుకుని, లేచి, చూస్తే ఇంకా తాతమ్మ నిద్రపోతూనే ఉంది.

తాతయ్య వెళ్ళి ఆవిడ దగ్గరగా కూర్చుని,'అమ్మా, నీరసం వస్తుంది- లే, లేచి ఏదైనా తిని, మళ్లీ పడుకో!' అన్నారు. ఆవిడ అతి కష్టం మీద కళ్లు తెరిచి, లేచి కూర్చుంది. "ఇప్పుడు అన్నం తినలేనురా; వేడిగా వేడిగా కాస్తంత కాఫీ త్రాగి, ఇట్లా కాసిని పళ్లు తింటా' అంది.

తాతయ్య ప్రక్కనే కూర్చుని ఇదంతా గమనిస్తున్నాడు బిట్టు. తాతమ్మ మాటలకి వాడు ఉలిక్కిపడ్డాడు. వాడి మనసులోకి ఒక్కసారిగా మళ్ళీ ప్రశ్నలు వచ్చేసాయి. ముఖాన్ని ప్రశ్నార్థకంలాగా మార్చి, తాతయ్యవైపు తిరిగి, ఆయన్ని ఏదో అడగాలని అనుకున్నాడు. అయితే తాతయ్య ఆ సరికే లేచి వెళ్ళిపోయారు: "ఇదిగో, మణీ! వేడి వేడిగా కాస్త కాఫీ అట, ఇవ్వు. ఆ తర్వాత కొంతసేపటికి పళ్ళు తింటుందట!" అంటున్నారు అమ్మమ్మతో.

పోయిన ఏడాదంతా బిట్టూ పళ్ళు ఒక్కటొక్కటిగా ఊడాయి. అవన్నీ నెమ్మదిగా

మళ్ళీ వచ్చేసాయి. బిట్టూ ఆ సంగతిని తలచుకుంటూ, నిన్ననే అడిగాడు తాతమ్మని: "ఎప్పుడొస్తాయి నీ పళ్ళు?" అని. తాతమ్మ బోసి నోరు తెరిచి భలే నవ్వింది.



"నా పళ్లు ఎప్పుడొస్తాయా? నీ అంత అయ్యాక వస్తాయిలే, మళ్లీ!" అంది.

తాతమ్మ మళ్లీ తనంత ఎలా అవుతుందో అర్థం కాలేదు బిట్టూకి. అమ్మమ్మని అడుగుదామంటే పనిలో ఉంది. 'కాల్షియం బాగా తింటే, నాకు వచ్చేసినట్లు తొందర తొందరగా, గట్టి పళ్లు మళ్ళీ వచ్చేస్తాయి! ఆ సంగతి తాతమ్మకు తెలుసో, మరి తెలీదో' అనుకున్నాడు. "ఫ్రూట్స్, నట్స్ ఎక్కువగా తినాలని చెప్పాలి, తాతమ్మకి!" అని కూడా అనుకున్నాడు.

ఇంతలో తాతయ్య వచ్చారు గదిలోకి. 'బిట్టూ, అమ్మమ్మని కాఫీ పెట్టమన్నాను. ఎంతవరకు వచ్చిందో, ఏంటో ఓసారి వెళ్ళి చూడు! తాతమ్మకి కాఫీ పట్టుకురా, కొంచెం' అనేసరికి అమ్మమ్మ దగ్గరకి వెళ్లాడు.

అమ్మమ్మ కాఫీ కాచే పనిలోనే ఉంది. తన సందేహం ఎవరు తీరుస్తారో తెలియలేదు బిట్టూకు. వెనక్కి తిరిగి మళ్లీ తాతమ్మ గదిలోకి వెళ్లాడు, 'సంగతేంటో మొత్తం తనే తేల్చుకోవాలి' అని నిర్ణయించుకుంటూ. అంతలోనే అమ్మమ్మ కాఫీ పట్టుకొని వచ్చింది. తాతమ్మకి కాఫీ ఇచ్చి, తను మళ్ళీ వంట గదిలోకి వెళ్ళింది. బిట్టు కూడా అక్కడే, కొంచెం దూరంగా కుర్చీ మీద కూర్చున్నాడు.

తాతమ్మ కాఫీ త్రాగటం పూర్తయింది. 'ఇప్పుడు ఇంక ఏమి చేస్తుందా' అని కనిపెట్టుకుని కూర్చున్నాడు బిట్టు.

ఆలోగా అమ్మమ్మ ఆపిల్ చెక్కు తీసి, చిన్న చిన్న ముక్కలు కోసి, దానితో పాటు అరటిపండు కూడా ఒకటి తొక్క తీసి, పళ్లెంలో పెట్టి, తీసుకొచ్చింది. తాతయ్య ఏవో కబుర్లు చెబుతూ తాతమ్మ ప్రక్కనే కూర్చుంటే, తాతమ్మ తినటం మొదలు పెట్టింది. అమ్మమ్మ వంటింట్లో పని చూసుకుంటోంది. బిట్టు బుర్రలో ప్రశ్నలు వాడిని స్థిమితంగా కూర్చోనివ్వటం లేదు. లేచి అమ్మమ్మ వెనకే వంటింట్లోకి వెళ్లాడు: 'అమ్మమ్మా, పళ్లు ఎలా తింటారు?!' అని అడిగేసాడు.

అమ్మమ్మకి వాడి ప్రశ్న అర్థం కాలేదు.

'ఏం తినాలన్నా నోటితోనే కదరా, ఇంకెలా తింటారు?!' అంది, 'అసలు మనవడి ప్రశ్న ఏమిటా' అని ఆలోచిస్తూ.

'కాదు- ముందు ఇది చెప్పు- పళ్లు ఎందుకు తింటారు?' అడిగాడు బిట్టు.

''ఫ్రూట్స్ తింటే ఆరోగ్యం' అని మీ టీచర్ చెప్పారన్నావు కదా!' చేతిలోని పనిని ఆపి వాడివైపు చూసింది అమ్మమ్మ.

'అవుననుకో, ఫ్రూట్స్ తింటే ఆరోగ్యం. కానీ మరి, పళ్లు ఎందుకు తినటం?

అసలు పళ్లు ఎలా...ఎలా తింటారసలు? తాతమ్మకి పళ్లు లేవు కదా, ఆవిడ పళ్లు తినాలంటే ఎక్కడినుండి తెచ్చిస్తారు?

పళ్ళు తింటే మళ్లీ పళ్ళు వచ్చేస్తాయా?' వరస ప్రశ్నలు వేసాడు బిట్టు.

అప్పుడు అర్థం అయింది అమ్మమ్మకి! బిట్టుకి తెలుగులో కొన్ని పదాలు మాత్రమే తెలుసు. 'పళ్లు' అంటే 'నోట్లో పళ్లు' అనుకుంటున్నాడు వాడు!

"ఫ్రూట్స్ ని కూడా తెలుగులో పళ్ళు అనే అంటారు" అని వాడికి తెలిసినట్లు లేదు! 'అరటి పండు' అంటాడు; కానీ 'అరటి పళ్లు' అని బహువచనం వాడుక తెలీదన్నమాట, వాడికి!

అమ్మమ్మకు చెప్పలేనంత నవ్వొచ్చింది. కానీ తను నవ్వితే వాడు ఉక్రోషపడతాడు. అందుకని బలవంతంగా నవ్వు ఆపుకున్నది.

వాడిని దగ్గరకి పిలిచి, పెరట్లో జామ చెట్టు క్రిందకి తీసుకెళ్లింది. అక్కడ తీరిగ్గా కూర్చుని, వాడికి 'పళ్లు' అనే మాటకు ఉన్న మరో అర్థం కూడా చెప్పింది, అర్థం అయ్యేట్లు.

బిట్టు ఆశ్చర్యానికి అంతు లేదు. "ఓహ్! నేను ఇంకా నేర్చుకోవలసిన తెలుగు చాలానే ఉంది" అన్నాడు. "తెలుగు రాయటం, చదవటం నేర్చుకుంటాను అమ్మమ్మా! అప్పుడు ఇంక అన్నీ నేనే చదువుకోవచ్చు. నిన్నో, తాతయ్యనో అడగాల్సిన అవసరం ఉండదు!" అన్నాడు.

"అవునురా! కొంచెం భాష రాగానే అక్షరాలు నేర్చుకోవాలి. బాగుంటుంది" అంటూ అమ్మమ్మ తాతయ్యని పలక తెమ్మన్నది. "ఆలస్యం ఎందుకు? వెంటనే తెచ్చుకుందాం, రా!" అంటూ బిట్టుని తీసుకొని బయలుదేరాడు తాతయ్య. •

(మిగతా కథ... వచ్చే మాసం)

**చిలిపి ప్రశ్నలు - తిక్క జవాబులు**

1. తాజ్ మహల్ ఎక్కడ ఉంది?
 జవాబు: భూమ్మీద!
2. చలి కాలంలో ఐస్క్రీం తింటే ఏమౌతుంది?
 జవాబు: కప్పు ఖాళీ అవుతుంది!
3. రెండు మామిడి పళ్ళను ముగ్గురు ఎలా పంచుకోవాలి?
 జవాబు: చేతులతో!
4. గుడికి వెళ్ళినప్పుడు, బొట్టు దేనికి పెట్టుకుంటారు? జవాబు: నుదుటికి!
5. బస్సులో ఎంతమంది కూర్చోవచ్చు?
 జవాబు: పట్టినంత మంది!
5. ఆఫ్రికా గిరిజనులు అరటిపండు ఎలా తింటారు?
 జవాబు: ఒలుచుకుని!
6. కొబ్బరికాయని పగలుకొట్టకుండా ఎలా తినగలం?
 జవాబు: రాత్రి కొట్టి తినవచ్చు!
7. హుస్సేన్ సాగర్ లో బుద్ధుడు ఒక చేతిని పైకి ఎత్తి ఉంటాడు ఎందుకు?
 జవాబు: కింద నీరు పెరిగితే పైకి పోతారని చెప్పేందుకు!
8. నిద్రలో మంచం మీదనుంచి కిందపడితే ఏమౌతుంది?
 జవాబు: మెలకువ వస్తుంది!
9. రోడ్డుపై స్పీడ్ బ్రేకర్ లు ఎందుకు పెడతారు?
 జవాబు: డ్రైవర్ని నిద్ర లేపడానికి!

*సేకరణ: బి. అశోక్, చెన్నేకొత్తపల్లి.*




# మారిన జీవితం

రచన: హిమ వర్షిణి, 8 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.

అందమైన గులాబీపూవుకు కూడా చుట్టూ గుచ్చుకునే ముళ్ళుంటాయి. అందంగా కనిపించే మన ఈ ప్రపంచానికీ అంతే- దీనికి ఇంకో వైపున పేదరికం, సంఘర్షణలు ఉన్నాయి. వాటిని తప్పించి చూస్తే మళ్ళీ అందమైన ప్రపంచం కనిపిస్తుంది.

అనగనగా ఒక చిన్న ఊరుండేది. దాని పేరు బంగారుపాల్యం. పైకి చూస్తే ఆ ఊళ్లో అందరూ బాగున్నట్లే కనిపిస్తుంది. కానీ దగ్గరగా చూస్తేనే, కొన్ని కుటుంబాల వ్యథలు కనబడేది.

ఓ కుటుంబంలో దంపతులు రంగమ్మ, రంగయ్య; వాళ్లకు ఇద్దరు పిల్లలు ప్రియ, రమేష్ ఉండేవాళ్ళు. దంపతులిద్దరూ కూరగాయలు పండించేవాళ్ళు. రంగయ్య వాటిని పట్నం తీసుకెళ్ళి అమ్ముకొచ్చేవాడు.

రంగమ్మ ఒకవైపున పొలం పనులు, ఇంటి పనులు చేస్తూనే, మరోవైపున రకరకాల పచ్చళ్లు తయారుచేసేది. భర్త వాటిని తీసుకెళ్ళి అమ్మేవాడు. అట్లా నాలుగు చేతులూ కష్టపడితే, వాళ్ళ కుటుంబం పడుతూ లేస్తూ నడిచేది.




రమేష్ ఇప్పుడు ఇంటర్మీడియట్ చదువుతున్నాడు. "మీవాడు చాలా బాగా చదువుతాడు. నీట్ పరీక్ష రాయించండి. డాక్టరు అవుతాడు" అని కాలేజీవాళ్ళు రంగయ్యకు చెబుతున్నారు. కానీ పరీక్షకు అవసరమయ్యేన్ని డబ్బులు కూడా లేవు రంగయ్య దగ్గర- ఇక మెడిసిన్ చదివించేన్ని డబ్బులు ఎక్కడినుండి వస్తాయి? అయినా పిల్లవాడి ముచ్చట తీర్చాలని, డబ్బులు అప్పు తెచ్చి పరీక్షలు రాయించాడు రమేష్ చేత. రమేష్ కు మంచి ర్యాంకే వచ్చింది!

కొడుకును మెడికల్ కాలేజీలో చేర్చాలంటే నాలుగు లక్షల రూపాయలు కావాలి. "బ్యాంకు నుండి అప్పు ఇస్తారు- మళ్ళీ మీ వాడు కట్టుకుంటాడు. ఎంతో కష్టపడితే తప్ప మెడిసిన్‌లో సీటు రాదు. ఊరికే పిల్లవాడి బ్రతుకు ఎందుకు నాశనం చేస్తావు? అప్పు తీసేసుకో!" అని తెలిసినవాళ్ళు ప్రోత్సహించారు.

"అప్పు తీసుకున్నా కూడా ఇంకా చాలా డబ్బులే అవసరమౌతాయి చేతి మీదినుండి. మనకు అంత ఎక్కడుంది?" పెదవి విరిచింది రంగమ్మ.

"ప్రియని చదువు మాన్పిద్దాములే. కొంచెం ఆ పాప సంపాదనా ఉంటుంది, మిగిలే ఆ కాసిని డబ్బులతో వీడి ఖర్చులూ తీరతాయి. వాడు పెద్దయ్యాక, ఎవరో దీనికి తగిన

మొద్దుని తెచ్చి పెళ్ళి చెయ్యకపోడు- ఆ మాత్రం బాధ్యత ఉన్నవాడేలే" అన్నాడు రంగయ్య. రంగమ్మ కూడా సరేనన్నది.



దాంతో రమేష్ మెడికల్ కాలేజీలో చేరాడు; కానీ పాపం, ప్రియ చదువులు అటకెక్కాయి.

ఇప్పుడు ఇంక ప్రియ బడికి వెళ్ళటం లేదు కదా! అందుకని తను ఇంట్లో అమ్మ సహాయం చేసేది; తమ పొలంలో పని చేసేది; వేరేవాళ్ల పొలాల్లో కూడా కూలికి పోయేది. ఒక్కోసారి ఏ పనీ దొరకనప్పుడు, తన వయసు పిల్లలతో ఆడుకునేందుకు పోయేది.

ఒక ఆదివారం నాడు అట్లా ఊళ్ళో పిల్లలందరూ ఊరి అవతల ఉన్న వాగు దగ్గరికి వెళ్ళారు. ఒక్కరొక్కరుగా అందరూ స్నానానికి దిగారు. ప్రియ మాత్రం అందరినీ చూస్తూ గట్టు మీదనే ఉండిపోయింది. వాగులోకి దిగిన పిల్లలు నీళ్ళలో ఆటలు మొదలుపెట్టారు. కొందరు ఈత పందాలు వేసుకున్నారు. వాళ్లలో గీత అనే అమ్మాయికి ఉత్సాహం ఎక్కువైంది. ఆ పాప ఊరి పెద్ద రంగారావుగారి కూతురు. "మీలో ఎవరైనా ఇక్కడ వాగును దాటుకొని, అవతలి ఒడ్డు మీదుగా వంద అడుగులు నడిచి, ఇంకా అవతల ఉన్న జలపాతంలో చిక్కుకోకుండా ఇవతలికి రాగలరా?!" అని పందెం వేసింది.

జలపాతం అంటే అక్కడ అందరికీ భయం. "మావల్ల కాదు" అంటే "మా వల్ల కాదు" అన్నారు అందరూ.

కానీ గీతకు అభిమానం అడ్డొచ్చింది- "నేను వెళ్ళి రాగలను!" అనేసింది.

అందరూ ఒద్దంటే ఒద్దన్నారు. వాళ్ళు ఒద్దన్న కొద్దీ గీతకు పట్టుదల హెచ్చింది. "లేదు- మీరంతా పిరికివాళ్ళు! నేను పోయి వస్తాను; మీరంతా ఇక్కడే కూర్చొని గాజులు తొడుక్కోండి" అంటూ అవతలి ఒడ్డుకు

ఈదిపోయింది.

ఒడ్డున కూర్చున్న ప్రియలో ఆందోళన ఎక్కువైంది; కానీ డబ్బున్న వారి పాప నిర్ణయం; ఈ పేద పాప ఏం కాదనగలదు?!




అందరూ వాగులోంచి బయటికి వచ్చి చూడటం మొదలు పెట్టారు. గీత మళ్ళీ వాగులోకి దూకింది. తీరా వాగు మధ్యలోకి వచ్చేసరికి ఒక్కసారిగా నీళ్ళ వేగం ఎక్కువైంది. ఎదురు ఈదేందుకు తన శక్తి చాలలేదు. కొట్టుకుపోతూ నిస్సహాయంగా అరవటం మొదలు పెట్టింది.

ఒడ్డున ఉన్న పిల్లలంతా గగ్గోలుగా అరిచారు. కానీ ఎవ్వరూ తెగించి నీళ్లలోకి దిగేందుకు గానీ, గీతను కాపాడేందుకుగానీ సాహసించలేదు.

ఇంకా కొద్ది సేపట్లో జలపాతంలో పడిపోతుందనగా అకస్మాత్తుగా గీతను ఎవరో పట్టుకొని ఇవతలికి లాగారు. ఆ సరికి గీత నీళ్ళు మ్రింగి మునకలు వేస్తున్నది. గీతను పట్టుకొని, వాళ్లెవరో బలంగా ఈదుతూ ఒడ్డు చేరారు! చూస్తే అలా కాపాడినవాళ్ళు వేరెవరో కాదు- ప్రియనే! ఒడ్డున కూర్చున్న ప్రియ నీళ్ళలోకి ఎప్పుడు దిగింది, ఎప్పుడు గీతను చేరింది, ఎలా కాపాడింది ఎవ్వరికీ అర్థం కాలేదు!

ఆ రోజున ఊళ్ళోవాళ్లంతా ప్రియకు బ్రహ్మ రథం పట్టారు.

"నువ్వు లేకపోతే ఈ రోజున మా పాప మాకు దక్కేది కాదు! నీకు ఏమిచ్చినా ఈ రుణం తీరదు. చెప్పు- నీకు అన్నింటిలోకీ ఏది ఇష్టం?" అడిగాడు ఊరి పెద్ద.

"నాకు చదువుకోవటం అంటే ఇష్టం. బడికి

వెళ్లటం అంటే ఇష్టం" అంది ప్రియ.

"చాలా మంచిది! నువ్వు ఎంతవరకూ చదివితే అంతవరకూ నేను చదివిస్తాను! నీ చదువులు ఇక పూర్తిగా నాదే, బాధ్యత!" అన్నాడు ఊరిపెద్ద.

అట్లా ప్రియ చదువులు మళ్ళీ మొదలయ్యాయి.

కొన్నేళ్ళకు, ప్రియ కాలేజికి వచ్చేసరికి- రమేష్ డాక్టరయి తిరిగి వచ్చాడు!

ఇక అటుపైన వాళ్ల కుటుంబం స్థిరత్వపు బాటలో పయనించటం మొదలు పెట్టింది!



రంగమ్మ, రంగయ్యల కష్టాలు తీరాయి! మంచి రోజులు వచ్చాయి!

**తెలివి నా సొత్తు!**

సుబ్బారావు: బావా! రాత్రి పూట నీ మొబైల్ ఛార్జింగ్‌కి పెట్టి పడుకోవద్దు.

వెంగళ్రావు: ఎందుకు రా..?

సుబ్బారావు: సెల్ ఫోన్ బ్యాటరీ బ్లాస్ట్ అవ్వచ్చు.. జాగ్రత్త!

వెంగళ్రావు: ఓరి వెర్రిముఖమా! అందుకేరా, నేను బ్యాటరీ తీసేసి ఛార్జింగ్ పెట్టుకునేది!

నవ్వు!

**కొత్త ఐడియా!**

రైల్వే వాళ్ళు ఒకసారి పొరపాటున వెంగళప్పను ఇంటర్వ్యూకి పిలిచారు.

బోర్డ్ మెంబరు: రైలు ప్రమాదాలు ఆపటానికి నువ్వు ఏమేం జాగ్రత్తలు తీసుకుంటావు?

వెంగళప్ప: మొట్టమొదట, అన్ని రైలు పట్టాలకూ స్పీడు బ్రేకర్లు పెట్టిస్తా సర్!!



# సూపర్ మ్యాన్!

*నిజంగా సూపర్‌మ్యాన్ అనేవాడొకడు ఉన్నాడా? ఏమో, మాకైతే ఎప్పుడూ కనిపించలేదు! మీకేమైనా కనిపించాడా, మరి ? కలల్లోనైనా ?*

*రచన: లోకేష్, 6 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు.*

నేనొక సూపర్ మ్యాన్‌ని. ఎగరగలుగుతాను. ఎటు కోరితే అటు వెళ్ల గల్గుతాను. దూరదూరాల్లో ఏం జరుగుతున్నదీ కూడా నాకు కనిపిస్తుంది. నన్నెవరు తలచుకున్నా నాకు వినిపిస్తుంది..

ఒకరోజున నేను అట్లా ఊరికే కూర్చొని ఉంటే, ఎవరో సహాయం కోసం పిలుస్తున్నట్లు నాకు అనిపించింది. తక్షణం నేను అటువైపుకి ఎగిరాను.

చూస్తే అక్కడ ఇల్లు ఒకటి, కాలి పోతున్నది! ఆ ఇంటిలో ఒక పిల్లవాడు ఇరుక్కుపోయి ఉన్నాడు. బయటికి రాలేక ఏడుస్తున్నాడు. నేను ఇంక అటూ ఇటూ చూడలేదు: రివ్వున వాడి దగ్గరికి దూసుకు పోయాను. వాడిని ఎత్తుకొని, కిటికీలోంచి అంతే వేగంగా బయటికి ఎగిరిపోయాను. నేను వాడిని

బయటికి తీసుకెళ్ళిన మరుక్షణం ఇల్లు మొత్తం కూలిపోయింది! నిజానికి నా వెనక ఏం జరిగిందో నాకు తెలీనే లేదు.

నేను ఆ పిల్లవాడిని క్రిందికి దింపి, వాడి తల్లిదండ్రులకు అప్పగించటంలో బిజీగా ఉన్నాను. అక్కడ చేరినవాళ్లంతా నన్ను చాలా మెచ్చుకున్నారు. అభినందించారు. "సూపర్ హీరో!" అని పొగిడారు.




ఇక ఆనాటినుండి నేను అందరికీ సహాయం చేస్తూనే ఉన్నాను. ఒకసారి పది అంతస్తుల భవనం ఒకటి కూలిపోవస్తున్నది. సరిగ్గా ఆ సమయానికి నేను అక్కడే ఉన్నాను.

నేను నా చేతులతో ఆ భవనాన్ని నిలబెట్టబోయాను. కానీ దాన్ని అలా నిలపటం అసాధ్యం. దాని పునాది సరిగా లేదు- ఒక వైపునుండి అది మెల్లగా కూరుకుపోతున్నది. నేను నా శక్తినంతా వెచ్చించి, భుజాల్ని దానికి తాటించి నిలబడ్డాను. అట్లా అది కొంత సేపు నిలబడింది; కానీ అంతలోనే మెల్లగా క్రుంగిపోసాగింది!

ఆ సమయంలో నాకు చాలా నిరాశగా అనిపించింది: 'ఈ పని నా వల్ల కాదు; నేను ఏమీ చేయలేను' అని. అయితే అది ఒక్క క్షణం మాత్రమే..

మళ్ళీ నేను ధైర్యం తెచ్చుకున్నాను. క్రుంగిపోతున్న భాగాన్ని నా చేతులతో పట్టుకొని ఎత్తటం మొదలు పెట్టాను. అక్కడ చేరినవాళ్లంతా నన్ను ప్రోత్సహిస్తూ "సూపర్ హీరో! నువ్వు చెయ్యగలవు! నువ్వు వీళ్లందరినీ కాపాడగలవు" అని అరుస్తున్నారు.

అట్లా నేను దాదాపు ఒక అరగంట పాటు ఆ

భవంతిని నిలిపి ఉంచగలిగాను. అయితే ఆలోగా అందులో ఉన్న మనుషులందరూ బయటికి వచ్చేసారు. ఆ పైన నేను మెల్లగా భవంతిని వదిలి ఇవతలికి రాబోతున్నాను.. అంతలో గుంపులోంచి వినబడింది. నాకు బాగా పరిచయం ఉన్న గొంతే అది: "ఇట్లా అయితే ఎలాగ? అందరూ ఏమంటారు? ఎంత సేపురా, ఇలాగ? నా వల్ల కాదు" అంటున్నారు ఎవరో. "ఎవరది? ఏమంటున్నారు? ఇంత బరువు ఎట్లా మొయ్యాలి?" అంటున్నాను నేను.

"ఏం కల వచ్చిందిరా? మళ్ళీ ఆ సూపర్ మ్యాన్ కలేనా? ఎప్పుడూ ఆ పిచ్చి పిచ్చి సినిమాలు చూడద్దురా అంటే వినవు!" అంటోంది అమ్మ.

"ఓహో ఇదంతా కలేనా?!" అనుకున్నాను నేను.

"ఎంత కలైనా ఇంతమందికి సాయం చేయటం మాత్రం బలే ఉంది!" అని నవ్వుకుంటూ లేచి బాత్రూముకు పరుగెత్తాను. ●

1. జామ చెట్టు కింద జానమ్మ ఎంత గుంజినా రాదమ్మా !
2. ఒకటే తొట్టి,రెండు పిల్లలు?
3. కాళ్ళు చేతులు లేని అందగత్తెకు బోలెడు దుస్తులు?
4. నల్లకుక్కకు నాలుగు చెవులు?
5. చింపురు చింపురు గుడ్డలు, ముత్యాలాంటి బిడ్డలు!
6. తన్ను తానే మింగి, మాయమౌతుంది !
7. చూస్తే చూసింది గానీ కళ్ళు లేవు! నవ్వితే నవ్వింది గాని పళ్లు, నోరు లేవు! తంతే తన్నింది గాని కాళ్ళు లేవు!
8. నిలబడితే నిలుస్తుంది, కూర్చుంటే కూలబడుతుంది!
9. తోలుతోచేస్తారు. కర్రతో చేస్తారు. అన్నం పెడతారు, అదే పనిగా బాదుతారు!

పొడుపు కథలు

1. నీడ
2. వేరుశనగ
3. ఉల్లిగడ్డ
4. లవంగం
5. మొక్కజొన్న కంకి
6. మైనపు వత్తి
7. అద్దం
8. నీడ
9. మద్దెల



# వదిలిన మురికి

రచన: చాతుర్య, 7 వ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.



రమేష్ పట్టణంలో వాళ్ళ అమ్మతోపాటు ఉండేవాడు. తను ఎప్పుడూ మురికిగా ఉండటాన్ని ఇష్ట పడేవాడు. తన పరిసరాలను కూడా శుభ్రంగా ఉంచుకునేవాడు కాదు; వాళ్ల అమ్మ ఎన్నిసార్లు చెప్పినా వినేవాడు కాదు!

దాంతో వాడికి చాలా రోగాలు వచ్చేవి. ఎప్పుడూ జలుబు, దగ్గు, జ్వరం ఒకదాని తర్వాత ఒకటి వస్తూండేవి. వాడి చర్మం కూడా బాగా పాడౌతూండేది.

అయినా సరే, వాడు మాత్రం శుభ్రంగా ఉండేవాడు కాదు.



రమేష్‌కు చాలా నచ్చిన ప్రదేశం ఒకటి ఉండేది. అదేంటంటే, మ్యూజియం. ఏ పెద్ద నగరానికి వెళ్ళినా అక్కడి మ్యూజియంకి వెళ్ళటం అంటే చాలా ఇష్టం వాడికి.

వాళ్ళ అమ్మ వాడికి చాలా నగరాల్లో మ్యూజియంలు చూపించింది. అయినా వాడికి 'మళ్ళీ ఇంకో మ్యూజియంకి వెళ్ళాలి- ఇంకో మ్యూజియంకి వెళ్ళాలి' అని ఉండేది ఎప్పుడూ.

రమేష్ వాళ్ల బడిలో విద్యార్థులను మూడు నెలలకు ఒకసారి పిక్నిక్‌కు తీసుకు వెళ్ళేవాళ్ళు. ప్రతిసారీ "మనం మ్యూజియంకి వెళ్దామా?" అంటూనే ఉండేవాడు రమేష్. అయినా పిల్లలకు చాలా మందికి మ్యూజియంకంటే పార్కులే ఎక్కువ తెలుసు. అందుకని అందరూ ఎప్పుడూ పార్కుకే వెళ్దామనేవాళ్ళు.

కానీ ఒకసారి మటుకు రమేష్ మాటని ఒకె చేసారు అంతా! మ్యూజియమ్‌కు వెళ్దామని ఒప్పుకున్నారు! బడి వాళ్ళు కూడా "సరే! ఐతే ఈసారి మ్యూజియంకు వెళ్దాం" అన్నారు.

ఇది తెలిసిన దగ్గర నుండీ మ్యూజియమ్‌కు తీసుకు వెళ్ళే రోజు కోసం ఎదురు చూడసాగాడు రమేష్.

ఆ రోజుకు ఇంకా ఎన్ని రోజులు ఉన్నదో క్యాలండరులో గుర్తులు పెట్టి, రోజులు లెక్క పెట్టడం కూడా మొదలు పెట్టాడు. కానీ, ఏం లాభం?! సరిగ్గా వాళ్ళు మ్యూజియంకి వెళ్ళే ముందు రోజునే వాడికి తీవ్రమైన జ్వరం, కడుపు నొప్పి, విరేచనాలు మొదలైనై!

డాక్టరుగారు రమేష్‌ని పరీక్షించి "నీకు 'అమీబియాసిస్' వచ్చింది. ప్రేగులలో అమీబాలు చేరుకున్నాయి.

పరిశుభ్రంగా లేకపోవటం వల్ల సాధారణంగా ఈ రోగం వస్తుంటుంది.



ఇప్పుడు ఇక కనీసం నాలుగు రోజులైనా విశ్రాంతి తీసుకోవాల్సి వస్తుంది; చాలా రోజుల పాటు పరిశుభ్రతను పాటించాల్సి వస్తుంది. అట్లా కాకపోతే రోగం మళ్ళీ మళ్ళీ తిరగబడుతుంది కూడా; జాగ్రత్త" అని చెప్పాడు.

ఇంక అప్పుడు రమేష్ 'మ్యూజియం మ్యూజియం' అని ఎంత ఏడ్చినా ఏం లాభం? ఏమీ ప్రయోజనం లేదు!

దాంతో రమేష్‌కి బాగా బుద్ధి వచ్చేసింది. అప్పటి నుండీ చాలా శుభ్రంగా ఉండటం మొదలుపెట్టాడు. తన పరిసరాలను కుడా శుభ్రంగా ఉంచుకోవడం మొదలుపెట్టాడు.

వాడిలోని మార్పుని చూసి వాళ్ళ అమ్మ చాలా సంతోషపడింది. తనే సొంతగా రమేష్‌ను, వాడి బెస్ట్ ఫ్రెండ్స్‌నీ ఒక ఆదివారం నాడు మ్యుజియమ్‌కు కూడా తీసుకు వెళ్ళింది!

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి అన్యుల మనముల్
నొప్పింపక, తానొవ్వక,
తప్పించుక తిరుగువాడె ధన్యుడు సుమతీ!

**భావం:** ఓ మంచిమనస్సు గలవాడా! విను! ఎప్పటికి ఏది అవసరమో, అప్పుడు అంతవరకే మాట్లాడి, ఇతరుల మనసులు నొప్పించకుండా, తనూ బాధపడకుండా, తప్పించుకు తిరిగేవాడే ధన్యుడు!




# ఒంటి కన్ను రాచ్చసుడి ఖద

రచన: చరణ్, 8 వ తరగతి, రిషి వ్యాలీ స్కూల్, మదనపల్లి.

అనగనగా ఒక ఊళ్లో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవాళ్ళు. వాళ్ళకొక అందమైన చెల్లెలు ఉండేది. ఆ ఇద్దరు అన్నదమ్ముల పేర్లు రిషి, సాయి. వాళ్ళ చెల్లెలి పేరు వసుంధర. వసుందర అన్నం, ముద్దపప్పు చాలా బాగా చేస్తుంది.

అదే ఊరికి అవతల ఒక అడవి ఉండేది. ఆ అడవి చాలా దట్టంగా, బలే అందంగా ఉండేది. అయినా అటువైపుకు అసలు ఎవ్వరూ వెళ్ళేవాళ్ళు కారు. ఎందుకంటే ఆ అడవిలో అనేక కౄరమృగాలు ఉండేవి.

వాటన్నిటికంటే ఎక్కువ, అక్కడ ఒక గుహలో ఒంటి కన్ను రాక్షసుడు ఒకడు ఉండేవాడు. వాడు చాలా భయంకరుడు. వాడి చేతికి చిక్కినవాళ్ళెవ్వరూ ఇంత వరకూ తిరిగి రాలేదు. అయితే ఎందుకనో, వాడు

మటుకు అడవిని దాటి ఊళ్ళోకి వచ్చేవాడు కాదు. అందుకని ఊళ్ళోవాళ్ళంతా బ్రతికిపోతున్నారుగానీ, లేకపోతే ఒక్కరు కూడా మిగిలే వాళ్ళు కాదు

ఒకసారి వసుంధరకు ముద్దపప్పు చేయాలనిపించింది. మంచి ముద్దపప్పు తయారవ్వాలంటే సన్నటి పుల్లల సెగ మీద పప్పుని రెండు గంటలపాటు ఉడకబెట్టాలి. "చాలా పుల్లలు ఏరుకు రండిరా, అన్నయ్యలూ" అని చెప్పింది అన్నలకు. అన్నలిద్దరూ పుల్లలకోసం ఊరంతా వెతికారుగానీ, ఏమన్ని దొరకలేదు. వాళ్ళు తమకు దొరికిన కొన్ని పుల్లల్నీ తీసుకొచ్చి "ఇదిగో, వీటితో సర్దుకో- ఇంక పుల్లలు దొరకవు" అని చెప్పేసారు.

వసుంధరకు కోపం వచ్చేసింది. "పుల్లలు కూడా దొరక్కపోతే ఇదేం ఊరు?" అని అరిచి, చకచకా బయటికి పోయి చూసింది. నిజంగానే ఎక్కడా పుల్లలు లేవు! అట్లా సగం అవసరంతోటీ, సగం కోపంతోటీ విసవిసా నడుచుకుంటూ అడవిలోకి అడుగు పెట్టేసింది.

అసలు ఆ అడవిలోకి ఎవ్వరూ మనుషులు పోరు కదా, అందుకని అక్కడంతా చాలా పుల్లలే ఉన్నాయి. సంతోషంగా వాటిని ఏరుకుంటూ ఉండిపోయింది వసుంధర. అకస్మాత్తుగా అక్కడంతా చీకటి ఐపోయింది.




ఏంటా అని చూస్తే రాక్షసుడు! వాడు వసుంధరను ఒక్క చేత్తోటే ఒడిసి పట్టుకొని తన గుహవైపుకు నడవసాగాడు! వసుంధర ఎంత పెనుగులాడితే మటుకు, ఏం ప్రయోజనం?! వాడికున్న బలం ముందు తన శక్తి ఎందుకూ పనికిరాలేదు!

"చెల్లి ఇంకా తిరిగి రాలేదేమి?" అని అన్నలిద్దరూ ఊరంతా వెతికారు.




చివరికి తన కాలి గుర్తుల ఆధారంగా తను అడవిలోకి వెళ్ళిందని గుర్తించారు. ఆవేశంకొద్దీ ధనస్సు, బాణాలు పట్టుకొని, వాళ్ళు కూడా అడవిలోకి దూరారు.

ఇంకేముంది? రాక్షసుడు వాళ్ళిద్దరినీ కూడా పట్టుకునేసాడు! పెద్దగా నవ్వుకుంటూ వాళ్ళను కూడా తీసుకెళ్ళి గుహలో పడేసాడు.అటుపైన గుహకు ఒక పెద్ద బండరాయిని అడ్డం పెట్టి, ఉషారుగా ఈల వేసుకుంటూ అడవిలోకి బయలుదేరి పోయాడు!

చూస్తే అక్కడ గుహలోనే ఉంది వసుంధర! గుహలోనే ఒక మూలకి పొయ్యి వెలుగుతున్నది. పొయ్యిమీద కుతకుతా ఉడుకుతున్నది, ముద్దపప్పు!

అన్నలిద్దరినీ చూసి ఆ పాప చాలా సంతోషపడింది. "మీరొచ్చేసారుగా, ఇంకేమీ పర్లేదు. ఇదిగో, ముందు ముద్దపప్పు తినండి" అన్నది సంతోషంగా.

"ఏమీ ఎట్లా పర్లేదు? అయినా నీ ముద్దపప్పే మనల్ని ఇంత కష్టాల్లోకి తీసుకొచ్చింది. ఇంతవరకూ వచ్చి కూడా నువ్వు నీ ముద్దపప్పుని వదల్లేదు!" అన్నాడు చిన్నన్న కోపంగా.

"అట్లా కోపం చేసుకోకురా అన్నయ్యా! ఉదయం అనగా నన్ను ఇక్కడికి తెచ్చి పడేసాడా, చూస్తే ఇక్కడ చాలా కందిపప్పు కనబడింది. వెంటనే నేను ముద్దపప్పు చేసాను. రాక్షసుడు ఇవాళ్ల మధ్యాహ్నం ఆ ముద్దపప్పుతోటే భోజనం చేసాడు. వాడికి

అదేదో చాలా నచ్చినట్లుంది- ఇంకా చేసిపెట్టమని మరిన్ని కందిపప్పులూ, కట్టెపుల్లలూ తెచ్చిపడేసాడు! నిజానికి ఇవాళ్ల రోజంతా ఆ పప్పేదో చేసి పెదుతున్నాను కాబట్టే, నన్ను తినెయ్యలేదు వాడు- లేకపోతే ఈ పాటికి నేను వాడి కడుపులో జీర్ణంకూడా అయిపోయి ఉండేదాన్ని! ఇట్లా రాక్షసుడి వంటదాన్ని ఐపోయాను నేను!" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది వసుంధర.

"లేదులే! అంత కష్టం ఏమీ లేదు. మేం వచ్చేసాంగా? రాక్షసుడిని చంపేసి, నిన్ను కాపాడతాం" అన్నారు అన్నలిద్దరూ.

అంతలోనే రాక్షసుదు గుహ తలుపు తెరుచుకొని లోపలికి వచ్చేసాడు. అన్నలిద్దరూ ముద్దపప్పు తింటుండటం చూసి ఆశ్చర్యపోతూ నోరు తెరిచాడు. వాడిని చూడగానే అన్నలిద్దరూ చటుక్కున లేచి నిలబడి, గురిచూసి చెరొక బాణమూ వేసారు వాడి ముఖం మీదికి. తమ్ముడు విసిరిన బాణం వాడి నోట్లో గుచ్చుకున్నది. అన్న వేసిన బాణం పోయి వాడి కన్నులో గుచ్చుకున్నది!

ఆ రాక్షసుడి ప్రాణం వాడి కన్నులోనే కదా, ఉన్నది?! అందుకని వాడు కాస్తా టపాలున క్రిందపడి, చచ్చిపోయాడు!

వసుంధర, అన్నలు అంతా క్షేమంగా వాళ్ళ ఇల్లు చేరుకున్నారు. అంత పెద్ద రాక్షసుడిని ఈ పిల్లలు ఇద్దరూ చంపేసారని తెలిసి ఊళ్ళోవాళ్లంతా ఎంత ఆశ్చర్యపోయారో చెప్పలేము! •

| | |
|---|---|
| అక్కరకు రాని చుట్టము<br>మ్రొక్కిన వరమీని వేల్పు మోహనమున దా<br>నెక్కిన బారని గుర్రము<br>గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ! | అడిగిన జీతం బియ్యని<br>మిడిమేలపు దొరను గొల్చి మిడుగుట కంటెన్<br>వడి గల ఎద్దుక గట్టుక<br>మడి దున్నుక బ్రతకవచ్చు మహిలో సుమతీ! |




# పిచ్చుకల ముచ్చట



రచన : ఎ. స్నేహితా రెడ్డి, 6 వ తరగతి, అరవింద హైస్కూల్, కుంచనపల్లి.

ఒక ఊళ్లో రైస్‌మిల్లు ఒకటి ఉండేది.

ఆ ప్రాంతాల్లోనే ఒక పిచ్చుకల జంట ఉండేది. రైస్‌మిల్లు బయటివైపున చూరులో గూడు చేసుకున్నాయవి. తినేందుకు అక్కడ వాటికి లెక్కలేనన్ని బియ్యపు గింజలు, పురుగులూ దొరికేవి. అయినా అదేంటో గానీ అంత సంపద ఉన్నా, ఆ ఊళ్ళో మరొక పిచ్చుకల జంట అంటూ లేదు!

ఒకసారి ఆడ పిచ్చుక రెండంటే రెండే గుడ్లని పెట్టింది. వాటిని చాలా జాగ్రత్తగా పొదిగింది. కొన్ని రోజుల తరువాత వాటిలోంచి రెండు చిట్టి చిట్టి పిచ్చుక పిల్లలు బయటకు వచ్చాయి. పెద్ద పిచ్చుకలు రెండూ పిల్లలకు సరిపోయేంత లేత పురుగులను పట్టుకొచ్చి తినిపించాయి. కొంచెం కొంచెంగా అవి పెద్దయ్యాయి. గూడులోంచి బయటికి వచ్చి, దగ్గర్లోని కొమ్మమీద కూర్చునే దశకు

వచ్చాయి. ఒక రోజున పెద్ద పిచ్చుకలు రెండూ ఆహారం కోసం వెళ్ళినప్పుడు, చిన్న పిచ్చుకలు రెండూ కొమ్మ మీదికి వెళ్ళి మాట్లాడుకుంటున్నాయి:

ఒక పిచ్చుక పిల్ల అన్నది: మనకు ఆడుకునేందుకు వేరే స్నేహితులు ఎవ్వరూ దొరకడం లేదు

రెండో పిచ్చుక పిల్ల: అవునే! నేను ఇంతకాలమూ గమనించనే లేదు! మనం తప్పిస్తే ఈ ఊళ్ళో వేరే పిచ్చుక పిల్లలే లేవు!

మొదటి పిచ్చుక పిల్ల: ఎందుకు? మనలాంటి పిచ్చుకలకు ఏమైంది? ఇంత చక్కని ఊళ్ళో పిచ్చుకలే లేకుండా ఎట్లా అయ్యింది?

రెండో పిచ్చుక పిల్ల: ఏమో, తెలీదు- నిన్న వాళ్ళెవరో చెప్పుకుంటుంటే విన్నాను- మన జాతి పక్షులు అంతరించి పోతున్నాయట. ఎందుకనో మరి, అర్థం కాలేదు.

మొదటి పిచ్చుక పిల్ల: ఇందులో అర్థం కానిదేమున్నది? కాలుష్యం వల్ల! కాలుష్యం వల్లనే మన జాతి అంతరించి పోయింది.

రెండో పిల్ల: కాలుష్యం అంటే ఏంటి? ఇక్కడ రైస్‌మిల్లులో చెత్త, చెదారం ఏమీ ఉండవు. పెద్దగా పొగకూడా లేదు! ఊళ్ళో వాహనాలు కూడా ఏమన్ని లేవు కదా, మరి ఇంక ఈ కాలుష్యం ఎక్కడినుండి వస్తున్నది?



మొదటి పిల్ల: నేనూ మొదట్లో అలాగే అనుకున్నాను. కానీ తర్వాత అర్థమైంది. నేను మాట్లాడకుండా ఊరికే ఉన్నాననుకో. అప్పుడు కూడా నీకు ఏమైనా శబ్దం వినిపిస్తుందా, కొంచెం జాగ్రత్తగా ఆలోచించి చెప్పు?

రెండో పిల్ల: అవును. ఎప్పుడూ వినిపిస్తూనే ఉంటాయి కదా, "కుయ్.. కుయ్యీ....కీచ్..కీచ్" అని గాలిలోంచే

వస్తుంటాయి శబ్దాలు!

మొదటి పిల్ల: అదే, కాలుష్యం. ఇదివరకు ఈ శబ్దాలు ఉండేవి కావట. మనుషులు "సెల్ఫోనులు" అని ఏవో కనుక్కున్నారట. వాటికోసం పెద్ద పెద్ద టవర్లు కట్టారట.




ఆ టవర్లలోంచి ఇదిగో, ఇట్లాంటి శబ్దాలు వస్తాయి. అవి మనుషులకు వినపడవట; కానీ మనకు వినిపిస్తాయి! కొద్ది రోజులకి ఆ శబ్దాలకు తట్టుకోలేక మనవాళ్లంతా అవి వినపడని చోట్లకు పారిపోయారట. మన బంధువులంతా ఆ రకంగా అడవుల్లోకి చేరుకున్నారు. అందుకనే ఇక్కడ ఎవ్వరూ కనిపించట్లేదు మనకు!

రెండో పిల్ల: అయ్యో! మరి ఈ సంగతి తెలీదా, మనుషులకు?

మొదటి పిల్ల: పాపం, వాళ్లకి బాగా తెలీదు. వాళ్లకి వినపడవు కదా, ఈ శబ్దాలు! అందుకని అవి మనకీ వినిపించవనుకుంటారు. ఎవరైనా వాళ్లకి ఈ సంగతి చెబితే బాగుండు!

రెండో పిల్ల: భూమి మీద మనలాంటి పక్షులు కూడా బ్రతకాలంటే, వాళ్లు వాళ్ల పద్ధతులను కొంచెం మార్చుకోవాలి కదా! ●

తెలుగు బాల

కోకిలమ్మ చేసికొన్న పుణ్యంబేమి?
కాకి చేసికొన్న కర్మమేమి?
మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు
లలిత సుగుణజాల! తెలుగు బాల!

నరుడు మెచ్చెనేని నారాయణుడు మెచ్చు
దీనులందు దేవదేవుడుండు
మానవార్చనంబె మాధవార్చనమురా
లలిత సుగుణ జాల! తెలుగుబాల!




# తగిన శాస్తి

రచన: గౌతమి, 9 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర

అనగనగా ఓ అడవిలో తోడేలు ఒకటి ఉండేది. అమాయకంగా ఉండే జంతువులను నమ్మించి మోసం చేస్తుండేది అది.

ఒకసారి అడవి అంచుననే దానికి పెద్ద కోడి ఒకటి కనిపించింది. దాన్ని చూడగానే తోడేలుకు నోరు ఊరింది. కానీ అది తన చేతికి అంత సులభంగా దొరికేటట్లు లేదు..

"మీదికి దూకితే అది దొరక్కుండా పారిపోవచ్చు..ఏం చేద్దామా?" అనుకున్న తోడేలు స్నేహం నటిస్తూ, తను ఉన్న చోటినుండే : "ఏం అల్లుడూ?! ఎట్లా ఉంది ప్రాణం?" అంటూ పలకరించింది.

కోడి దాన్ని చూడగానే కలవర పడింది.

"అయ్యో! మావాళ్ళు అడవి దగ్గరికి వెళ్లద్దంటే వినకుండా ఇటు వచ్చానే, ఎంత తప్పైంది?!

ఇప్పుడు దీని నుండి తప్పించుకునే ఉపాయం వెతకాలి" అనుకున్నది.




పైకి మటుకు "బాగుంది మామా! చాలా బాగుంది! నువ్వెట్లా ఉన్నావు?! అత్తా, అల్లుళ్ళూ అంతా కులాసానా?" అంది, తను కూడా వరస కలుపుతూ.

దాని ఆ వరస తోడేలుకు చాలా నచ్చింది. "ఇక్కడెక్కడో నేను ఆ మధ్య ధాన్యపు గింజల రాశి ఒక దాన్ని చూశాను అల్లుడూ! మీకు మేత పరిస్థితి ఎలా ఉన్నది?" అని మాట కలిపింది.

"అబ్బో! మా మేతకేమి, అద్భుతంగా ఉంది మామా! మా గూట్లో ఒక వందమంది కోళ్లం ఉంటామా?! అందరం కలిసి కూర్చొని తిన్నా రెండేళ్లపాటు ఐపోదు- అంత మేత సేకరించి పెట్టుకున్నాం!

పైపెచ్చు, మాకో వ్రతం కూడాను! రోజూ ఎవరో ఒక అతిథి ఉండాలి! లేకపోతే మేం ఎవ్వరం అన్నమే తినం! అందుకనే ప్రతిరోజూ ఇట్లా అడవి బాట పడుతున్నాం!" నవ్వుతూ చెప్పింది కోడి, తెలివిగా.

"నీకు అభ్యంతరం లేకపోతే, మామా! నాతో పాటు రారాదూ, మా గూట్లో అందరం నీకు ఈ రోజున కడుపు నిండా విందు చేస్తాం!" అని జోడిస్తూ.

"ఓహో ఏమి నా భాగ్యం?! తంతే కోళ్ల బుట్టలో పడటం అంటే ఇదే! ఒకసారి దీనివెంట కోళ్ళగూడు చేరుకున్నానంటే ఇక అన్ని కోళ్లనూ భోంచేయచ్చు" అనుకున్న తోడేలు సంతోషంతో ఎగిరి గంతేసింది.

"ఓ! నువ్వు పిలవటమూ, నేను రాకపోవటమూనా, అల్లుడూ?! పద! పద!

ఇప్పుడే వస్తాను!" అంటూ కోడి వెంట బయలుదేరిందది.

కోడి దాన్ని తాము ఉండే గూటి దగ్గరికి తీసుకెళ్ళింది.

అవి ఇంకా అల్లంత దూరాన ఉండగానే మిగిలిన కోళ్లన్నీ గొల్లున అరవటం మొదలు పెట్టాయి.

"రా! మామా! మా వాళ్ళంతా నీకు స్వాగతం ఎలా పలుకుతున్నారో చూడు!" అంటూ ముందుకి దారి తీసింది కోడి.

కోళ్ల అరుపులు వినగానే బయటికి వచ్చిన కుక్కలు గట్టిగా మొరిగాయి. వాటి అరుపులు విన్న ఊళ్ళోవాళ్లంతా కట్టెలు పట్టుకొని వచ్చి తోడేలును చితకబాదారు.

"విందు పెడతారన్నావు కదా, అల్లుడూ!" అంది తోడేలు, పారిపోతూ.

"ఊరికే అన్నాను! ఈసారి అటొచ్చినప్పుడు నువ్వు చూపించే నిజం ధాన్యపు రాశిని ఎత్తుకొస్తాంలే మామా!" అంది కోడి, పరుగున పోయి తన వాళ్లను కలుసుకుంటూ. •

**సుభాషితాలు**

1. విద్య యొక్క లక్ష్యం పరీక్ష కాదు, పరివర్తన!
2. మంచి పుస్తకాలు లేని ఇల్లు ఆత్మ లేని శరీరం వంటిది!
3. విద్యాలయాలు దేవాలయాలకంటే గొప్పవి!
4. చినిగిన చొక్కా అయినా తొడుక్కో, కానీ ఓ మంచి పుస్తకం కొనుక్కో!
5. భుజబలం కన్నా బుద్ధి బలం మిన్న!
6. అసూయ లేనివాడు అందరికన్నా ఉత్తముడు!
7. సత్య మార్గంలో నడిచేవాడే సంపన్నుడు!
8. నీతి లేని వాడు జాతికి కీడు!
9. బలమే జీవితం.. బలహీనతే మరణం!

*సేకరణ: కురుబ హరీష్, 6వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర, అనంతపురం జిల్లా*



# చేజిక్కిన బంతి

బొమ్మల కథ

తొర్రల్లో అట్లా ఊరికే చేతులు పెట్టకూడదు! చీమలే ఉన్నై కాబట్టి సరిపోయింది! మరి పాములుంటే? ఎంత ప్రమాదం జరుగును?! రెండో తరగతి అచ్చుపుస్తకంలోని ఈ కథని మణికంఠ తన మాటల్లో చెప్పాడిక్కడ..చూడండి!

రచన : మణికంఠ, 2 వ తరగతి, క్రాస్ వర్డ్ స్కూల్, గుంటూరు



రాము తన స్నేహితులతో బంతి ఆట ఆడుతున్నాడు.




ఇంతలో బంతి ఎగురుకుంటూ పోయి ఒక చెట్టు తొర్రలో పడింది.




పిల్లలు బంతి కోసం చెట్టు తొర్రలో చేతులు పెట్టారు.

వాళ్లందరినీ చీమలు కుట్టాయి. బంతి మాత్రం దొరకలేదు.






అంతలో రాముకి ఓ మంచి ఆలోచన వచ్చింది.
బిందెతో నీళ్ళు తీసుకొచ్చి తొర్రలో పోశాడు.

బంతి నీళ్లమీద తేలుకుంటూ పైకి వచ్చింది!
పిల్లలంతా రాము తెలివిని మెచ్చుకున్నారు.




**తెలుగు బాల**

బడికి నడువ లేదు, పాఠాలు వినలేదు,
చిన్న పద్యమప్పజెప్పలేదు-
రాజ రాజు బిడ్డరా, నేటి విద్యార్థి!
లలిత సుగుణజాల తెలుగు బాల!!

రక్తి లేని ఆట రాత్రి నిద్దుర చేటు
భక్తి లేని పూజ పత్రి చేటు
నీతి లేని చదువు జీతాల చేటురా!
లలిత సుగుణజాల తెలుగుబాల!!




# సహాయం

బొమ్మల కథ

రచన: గణేష్, 8 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర




అనగనగా ఒక అడవిలో ఒక కోతి ఉండేది.

అది చాలా అల్లరి కోతి.

అది ఒక రోజు మామిడి చెట్టు ఎక్కింది.

అప్పుడే వస్తున్న కుందేలు కోతిని చూసి, "నాకు ఒక మామిడి పండు ఇవ్వు" అంది.

"నేను ఇవ్వను" అంది కోతి.




అప్పుడు కుందేలు ఆకలితోటే వెళ్ళిపోయింది.

అంతలో ఒక తోడేలు అటుగా వచ్చింది. కోతి దాన్ని చూసి బెదిరి, నేలమీద పరుగెత్తటం మొదలు పెట్టింది. తోడేలు దాని వెంటపడి తరిమి, చివరికి దాన్ని చేజిక్కించుకున్నది.

అటువైపుగానే కాస్త దూరాన తలవంచుకొని పోతున్నాయి కుందేలు, దాని మిత్రుడు జింకా. అవి చూసాయి, తోడేలు కోతిని ఎత్తుకుపోవడం.




రెండూ'కోతిని కాపాడాలి- ఎలాగ?'అని ఒక ఉపాయం ఆలోచించాయి.

గబగబా వెళ్ళి, తోడేలు వస్తున్న దారిలో ఓ చెట్టుకు మాంసం ముక్కను వ్రేలాడదీసాయి. ఆ మాంసం ముక్కని అందుకోవాలంటే తోడేలు బాగా పైకి ఎగరాలి. కోతిని లాక్కొస్తున్న తోడేలుకు చెట్టునుండి వ్రేలాడుతున్న మాంసం ముక్క కనపడగానే నోరూరింది. "కానీ ఈ

కోతి ఒకటి ఉన్నదే, ఎలాగ?" అని ఆలోచించింది.

కోతిని ఒక ప్రక్కగా చెట్టుమొదల్లో బంధించి వచ్చింది. మాంసం ముక్కను అందుకొనటం కోసం ఎగరబోయింది.




అయితే ఆ చెట్టు క్రింద ఉన్నది పెద్ద గుంత! కుందేలు, జింక ఆ గుంత కనబడకుండా దానిమీద ఆకులు, చెత్తా కప్పి ఉంచాయి! మాంసం ముక్కకోసం ఎగిరిన తోడేలు నేరుగా ఆ గుంతలోకే పడిపోయింది!

కుందేలు, జింక వెళ్ళి కోతిని విడిపించాయి.

కోతి కుందేలుకు క్షమాపణ చెప్పుకున్నది. "ఇంతకుముందు నువ్వు అడిగితే నేను పండు ఇవ్వనన్నాను. నన్ను క్షమించు" అన్నది.

"ఏం పర్లేదులే! మనకు ఆకలి ఎక్కువైనప్పుడు అందరమూ అలాగే చేస్తాము" అన్నది కుందేలు తేలికగా.

అటుపైన మూడూ కలిసి సంతోషంగా జీవించాయి.

"చదువది ఎంత గల్గిన, రసజ్ఞత ఇంచుక చాలకున్న ఆ చదువు నిరర్థకంబు"

ఎంత చదివినా, చదివిన అంశాలలోని రుచిని ఆస్వాదించలేకపోతే ఇక ఆ చదువు వ్యర్థమే!

# మూడవతరగతి గాంధి



*గాంధీలో చమత్కారం కొంచెం ఎక్కువ పాళ్ళలోనే ఉండేది. ఆయన చాలాసార్లు ఇట్లాంటి సమాధానాలు ఇచ్చాడు. ఐతే మరి గాంధీ మూడో తరగతిలోనే ఎందుకు ప్రయాణించేవాడు ? అసలు కారణం ఏంటి ?*
*రచన : శ్రీ లింగారెడ్డి బి.ఎ బి.ఇడి., అనంతపురం.*

1. మునుపు రైలునందు మూడు తరగతులు:
ఉన్నవారి కొరకు 'ఒకటి'-'రెండు'
బడుగు జనుల కొరకు మూడవ తరగతి-
'మూడు'నందె గాంధి వెడలుచుండె.

2. రైలుపెట్టె లోన ఐశ్వర్యవంతులు
అమెరికన్లు, గాంధి దరికి చేరి
"గొప్ప నాయకుడవు, చెప్పవలె జవాబు
చేయనేల 'మూడు' పయన మెపుడు?"

3. ధనిక నేల నుండి తరలి వచ్చినవారు
సూటు బూటు కలిగి యున్న వారు
వారి వద్ద గాంధి పలికెను, నవ్వుచు
రైలునందు, లేదు 'నాలుగ'వయది.

గతంలో రైలు పెట్టెల్లో మూడు తరగతులు ఉండేవి. ఒకటో తరగతి, రెండో తరగతి ధనవంతులకోసం; మూడో తరగతి పేదవారి కోసం. గాంధీ ఎప్పుడు రైలు ఎక్కినా మూడో తరగతిలోనే ప్రయాణించేవాడు.

ఒకసారి ఐశ్వర్యవంతులైన అమెరికన్లు కొందరు గాంధీని "నువ్వింత గొప్ప నాయకుడివి కదా, ఐనా ఎందుకు, ఎప్పుడూ మూడో తరగతిలోనే ప్రయాణిస్తావు?" అని అడిగారు.

గాంధీ నవ్వాడు: "ఎందుకంటే, మా రైళ్ళలో మరి నాలుగో తరగతి లేదు- ఏం చెయ్యను?" అన్నాడు.




# ఎవరి ఆవు?

రచన : సుదర్శన్, ఉద్యోగాన్వేషి, చెన్నేకొత్తపల్లి.

చంద్రపురం న్యాయాధికారి శాంతన్న చాలా మంచివాడు, తెలివి తేటలు గలవాడున్నూ. 'ఆయనైతే నిష్పక్షికంగా తీర్పు చెబుతాడు' అని ఆచుట్టు ప్రక్కల ఊళ్ళలో అందరూ చెప్పుకునేవాళ్ళు.

ఒకసారి భటులు ఇద్దరు వ్యక్తుల్ని, ఒక ఆవును ఆయన దగ్గరకు పట్టుకు వచ్చారు. "వీళ్ళు ఇద్దరూ ఈ ఆవు కోసం తగవులాడుతున్నారు ప్రభూ! ఈ మూగ ఆవుకు మాటలు వచ్చి ఉంటే సమస్య తీరిపోయేను; కానీ దానికి మాటలు రావు, వీళ్ళు కొట్లాట ఆపరు! తమరు ఏదో ఒకలాగా వీరి తగాదాను పరిష్కరించాలి" అని విన్నవించుకున్నారు.

"ఈ ఆవు నాదేనండయ్యా. తమరు గమనించండి" అన్నాడు సుబ్బయ్య గట్టిగా.

"కాదు ప్రభూ! ఇది నాది. పేదవాడిని దయచూడండి. వీడిని నమ్మకండి" అన్నాడు లింగయ్య, మరింత గట్టిగా.

శాంతన్న ఒక్క క్షణం ఆలోచించాడు.



"సరే, సుబ్బయ్యా! నువ్వు ఇక్కడ ఉండు. లింగయ్యా, కొంత సేపు బయట కూర్చో" అన్నాడు.

లింగయ్య మళ్ళీ ఒకసారి "ఆవు నాదేనండయ్యా!" అని చెప్పి బయటికి నడిచాడు.

"సుబ్బయ్యా! నీ ఆవు ఆనవాళ్ళు చెప్పు" అన్నాడు శాంతన్న.

"అయ్యా! నా ఆవుకి ఒకసారి వెనుక కాలులో ఎడమవైపున ఇనుప చువ్వ గుచ్చుకుని, పెద్ద గాయం అయ్యింది. గాయమైతే తగ్గింది గానీ మచ్చ అట్లాగే నిల్చిపోయింది" చెప్పాడు సుబ్బయ్య.

శాంతన్న ఆదేశం మేరకు భటులు ఆవు కాలుని పరిశీలించారు. నిజంగానే ఎడమ కాలుకు గాయపు మచ్చ ఒకటి ఉంది.

"సరిగా ఆనవాలు పట్టావు కాబట్టి, ఆవు నీకే చెందచ్చు. ఐతే ఇదే మాట లింగయ్యను కూడా అడుగుదాం, ముందు" అంటూ లింగయ్యను లోనికి పిలిచాడు శాంతన్న.

"లింగయ్యా! నీ ఆవు ఆనవాళ్ళు చెప్పు!" ఆదేశించాడు.

"నా ఆవు తోకమీద వరసగా మూడు అడ్డు గీతలు ఉంటాయి ప్రభూ!" అన్నాడు లింగయ్య.

భటులు ఆవును పరిశీలించి నిజంగానే ఆవు తోకమీద మూడు అడ్డుగీతలు ఉన్నాయని చెప్పారు.

"ఓహో! అయితే ఆవుని ఇద్దరూ బాగానే పరిశీలించి ఉన్నారే!" నవ్వాడు శాంతన్న.

"సరే! అయితే సుబ్బయ్యా, ఈ ఆవుని ఇవాల్టికి నువ్వు తీసుకెళ్ళు. మీ ఇంట్లో ఒక రోజు ఉంచుకొని, రేపు ఉదయం మాకు తెచ్చి ఇవ్వు. రేపు లింగయ్య తీసుకెళ్తాడు దీన్ని! ఆలోగా మేం ఆలోచించి, ఇది అసలు ఎవరిదో మర్నాడు తేలుస్తాం" అని చెప్పి ఆ రోజుకు సభను ముగించాడు శాంతన్న.




సుబ్బయ్య ఆవుని తోలుకొని వెళ్ళి, మరునాడు ఉదయాన్నే దాన్ని వెనక్కి తెచ్చి ఇచ్చాడు. ఆ వెంటనే లింగయ్య ఆవుని తోలుకెళ్ళాడు.

తర్వాతి రోజున సభ ప్రారంభం కాగానే శాంతన్న తీర్పు ఇచ్చేసాడు: "ఆవు సుబ్బయ్యదే" అని!

దాంతో సుబ్బయ్య ముఖం సంతోషంతో విప్పారింది. కానీ లింగయ్య మటుకు ఒప్పుకోలేదు: "అయ్యా! మీరేదో పొరపడి-నట్లున్నారు! మీరు ఈ నిర్ణయానికి ఎలా వచ్చారో తెలియకుండా ఉంది" అన్నాడు బాధగా.

శాంతన్న నవ్వి, "చూడు సుబ్బయ్యా! ఆవు మీ ఇద్దరి దగ్గరా చెరొక రోజూ ఉన్నది కదా; నీ దగ్గర వున్న రోజున అది ఉత్సాహంగా లేదు; సుబ్బయ్య దగ్గర ఉన్నప్పుడే ఉత్సాహంగా ఉంది. అదీ గాక, నువ్వు ఆవును పట్టుకెళ్ళాక, దాని అవసరాలకోసం ప్రత్యేకంగా ఏర్పాట్లు చేసావు: దాన్ని కట్టేసేందుకు గాటం కొత్తగా వేసావు; పలుపు కొత్తది కొన్నావు; నీళ్ళు పెట్టేందుకు మీ ఇంటిలోని బొక్కెనను కూడా కొత్తగానే తీసుకెళ్ళావు. సుబ్బయ్య దగ్గర ఆవుకు

కావలసిన వస్తువులన్నీ ముందుగానే ఉన్నాయి. ఆవు నీదే అయినప్పుడు, దానికి అవసరమైన వస్తువులు నీ దగ్గర ముందుగానే ఉండి ఉండాలి కద, ఇప్పుడు వెతుక్కునే అవసరం ఏముంటుంది?" అన్నాడు.




లింగయ్య ముఖం చిన్నబోయింది. అయినా అతను అంగీకరించక, "అయ్యా! తమరు పునరాలోచించాలి. పోయిన లక్ష్మి తిరిగి వస్తున్నదన్న ఉత్సాహంకొద్దీ వస్తువులు కొత్తగా అమర్చాను తప్పిస్తే, ఆవు మటుకు నాదే" అనేసాడు!

శాంతన్న ఏదో నిశ్చయించినట్లు, "సరే! నా తీర్పు సరైనదేనని నేను నిరూపిస్తాను. మీరిద్దరూ తలా ఇంత ఎండు గడ్డి చేత పట్టుకొని అటొకరూ, ఇటొకరూ నిలబడండి. కావాలంటే మీ ఆవుని మీరు పేరు పెట్టి పిలవండి" అని ఆదేశించి, ఆవుని వదల-మన్నాడు. ఆవు ఒకసారి ఇరు వైపులకూ చూసి, మెల్లగా సుబ్బయ్య దగ్గరికి చేరుకున్నది!

లింగయ్య ముఖంలో నెత్తురు చుక్కలేదు. తన మోసాన్ని అంగీకరించక తప్పలేదతనికి.

"'ఈ ఆవు నీది కాదు; సుబ్బయ్యది' అని తేలిపోయింది. ఇతరుల సొమ్మును ఆశించటమే కాక, న్యాయస్థానపు తీర్పు సరైనదైనా, దానిపై అవిశ్వాసం ప్రకటించినందుకుగాను నీకు వంద బంగారు నాణాలు శిక్ష విధిస్తున్నాను. ఒకవేళ ఏ కారణం చేతనైనా ఆ మొత్తాన్ని చెల్లించలేకపోతే ఏడాదిపాటు కారాగారంలో ఉండాలి" అని తీర్పు చెప్పాడు శాంతన్న.

సభికులంతా హర్షధ్వానాలు చేసారు. •




# అమరుకుని కథ

శ్లోకచమత్కారం - 6

కథ : శ్రీ ఇ.యస్. వి. రవి, అనంతపురం

మన దేశం జన్మనిచ్చిన అనేకమంది తత్వవేత్తలలో ఎన్నదగినవారు, ఆదిశంకరాచార్యులవారు. అతి చిన్న వయసులోనే వేదాలకు భాష్యాలు వ్రాసిన శంకరుడు, కేరళలోని 'కాలడి'లో జన్మించాడు. దేశమంతటా సంచరిస్తూ, అనేకమంది పండితులతో శాస్త్రచర్చలు జరిపి, గెలిచాడు. "పరమాత్మకు- ఆత్మకు భేదం లేదు" అనే 'అద్వైత' సిద్ధాంతాన్ని నెలకొల్పాడు.

ఓ సారి ఈయనకూ, మండనమిశ్రుడనే మరొక తత్త్వవేత్తకూ శాస్త్రాలమీద గొప్ప చర్చ జరిగింది. ఆ చర్చలో మండనమిశ్రుని భార్య ఉభయభారతి కూడా పాల్గొన్నది.

చర్చలో మండన మిశ్రుడు వెనుకబడ్డాడు. వాదనలో తన భర్త ఓడిపోతూ ఉండడం చూసి ఉభయభారతి కల్పించుకున్నది; ఆదిశంకరుడిని కుటుంబం గురించీ, పెళ్ళీ పిల్లల గురించీ ప్రశ్నించడం మొదలుపెట్టింది.

ఆదిశంకరులవారు చిన్నతనంలోనే సన్యసించినవాడు. పెళ్ళి చేసుకోలేదు; అందువల్ల సాంసారిక విషయాలేవీ ఆయనకు అనుభవంలో లేవు. మరి ఇప్పుడు జవాబు ఏమని చెబుతాడు? ఆయనకు ఎటూ పాలుపోలేదు. అందుకని అయన ఆ దంపతుల వద్ద కొంతకాలం సమయం అడిగాడు. 'ఉభయ భారతి అడిగిన అంశాల గురించిన అనుభవ జ్ఞానం సంపాదించటం ఎలాగ' అని ఆలోచిస్తూ దేశాటనను కొనసాగించాడు.

అట్లా పర్యటిస్తూ శంకరాచార్యులవారు, ఆయన శిష్యులు చివరికి ఒక రాజ్యం చేరుకున్నారు. ఆ రాజ్యపు రాజు అమరుకుడు. వీళ్ళు వెళ్ళే సమయానికి అమరకుడు చనిపోయి ఉన్నాడు. అతని శరీరాన్ని దహనం చేయాలని బంధువులంతా చితి పేరుస్తున్నారు. అది చూడగానే శంకరునికి ఒక ఆలోచన వచ్చింది. ఆ దగ్గరలోనే ఉన్న ఒక గుహలోకి పోయి కూర్చొని, శిష్యులతో "నాయనలారా, చూడండి, ఇప్పుడు నేను నా ఈ శరీరాన్ని విడిచిపెట్టి, అమరుకుని శరీరంలోకి ప్రవేశిస్తాను.




కొద్ది కాలం తర్వాత తిరిగి వస్తాను. నేను అలా తిరిగి వచ్చేంతవరకూ నా ఈ శరీరాన్ని మీరు జాగ్రత్తగా కాపాడుతూండండి" అని చెప్పి, శంకరులు తనకు తెలిసిన 'పర కాయ ప్రవేశం' అనే విద్యని ఉపయోగించుకొని, తన దేహాన్ని విడిచి, అమరుకుని దేహంలోకి ప్రవేశించారు.

మరుక్షణం అమరుకుడు లేచి కూర్చున్నాడు. బంధువులందరూ ఆశ్చర్యపోయారు: 'చనిపోయాడు అనుకున్నాం

గానీ, నిజానికి ఈయన ఇంకా ప్రాణాలతోటే ఉండి ఉంటాడు' అనుకున్నారు; రాజవైద్యులంతా నివ్వెరపోయారు, సిగ్గుతో తలదించుకుకున్నారు; ప్రజలంతా 'మా రాజుకు ఏమీ కాలేదు' అని చాలా మురిసిపోయారు. రాణిగారు, పిల్లలైతే మహా సంతోషపడ్డారు.



ఇక అక్కడ గుహలో, శంకరుని అసలు శరీరాన్ని కాపాడుకుంటూ, ఎప్పుడు తిరిగి వస్తాడా అని చూస్తూ కూర్చున్నారు ఆయన శిష్యులు.

అమరుకుని దేహంలోనికి చేరిన శంకరాచార్యులవారికి ఆ క్షణంనుండే సంసారం ఎదురైంది. ఆ ప్రపంచాన్ని ఆయన తనదైన నిర్లిప్తతతోటీ, నిరాసక్తతతోటీ గమనిస్తూ, తనకు ఎదురౌతున్న ప్రతి అనుభవాన్నీ తన జ్ఞానంలో పొదవుకుంటూ పోసాగాడు. రాజుగా ఆయన తీసుకున్న నిర్ణయాలన్నీ అద్భుతంగాను, వివేక పూరితంగాను ఉండినై తప్ప, గతంలో రాజు అమరకుడు ఇస్తున్నట్లు లేవు.

ఈ తేడాని మొదట గమనించింది, అమరకుని భార్య. ఆమె చాలా తెలివైనది. 'తన భర్తకు ఏమైంది? చనిపోయినట్లు ఎందుకయ్యాడు, మళ్ళీ ఎలాగ లేచి కూర్చున్నాడు? ఇంత చక్కగా, ఎవరో రుషి మాదిరి, ఎందుకు ప్రవర్తిస్తున్నాడు?' అని ఆమె ఆలోచిస్తూనే ఉన్నది. చివరికి ఆమెకు అర్థమైంది: "ఇది అసలు తన భర్త కాదు. ఎవరో వేరేవాడు, చనిపోయిన తన భర్త దేహంలో ఉన్నాడు!" అని. మరి ఇప్పుడు ఏం చేయాలి?

"ఇది అందరికీ చేతనయ్యే ఆషామాషీ విద్య

కాదు. ఈయన ఎవరో గొప్ప సిద్ధుడు అయి ఉంటాడు. అట్లాంటివాడు ఎందుకనో, అమరుకుని శరీరాన్ని ఎంచుకున్నాడు. త్వరలో విడిచిపెట్టి పోతాడు- అట్లా పోనివ్వకూడదు. ఇందులోనే ఉండేట్లు చెయ్యాలి. ఈ సిద్ధ పురుషుని వల్ల రాజ్యమూ, రాజవంశమూ కూడా చల్లగా కొనసాగేట్లు చూడాలి" అనుకున్నదామె.



వెంటనే ఆమె తెలివిగా, రాజుగారికి ఏమాత్రం తెలీకుండానే తమ సైనికులను ఆదేశించింది: "మన రాజ్యంలో ఎక్కడా శవం అంటూ లేకుండా చూడండి. జంతువుల శరీరాలు గానీ, మనుషుల శవాలుగానీ, వెతికి వెతికి అన్నిటినీ తక్షణం కాల్చేయండి" అని. "అట్లా కాల్చేస్తే, అమరుకుని దేహంలో ఉన్న సిద్ధపురుషుడి కళేబరం కూడా కాలిపోతుంది కదా, ఇక అతడు శాశ్వతంగా తమతో ఉండిపోతాడు!" అని ఆమె ఆలోచన.

ఇక ఇక్కడ, గుహలో ఉన్న శంకరుడి శిష్యులకు 'గురువుగారి దేహాన్ని కాపాడడం ఇప్పుడింక కష్టం' అని అర్థమవ్వసాగింది. కనిపించిన శవాలనన్నిటినీ కాల్చేస్తున్నారు రాజభటులు. ఏదో ఒక క్షణాన వాళ్ళు గుహ దగ్గరికి రాకపోరు; గురువుగారి శరీరాన్ని కూడా కాల్చేయకపోరు! ఎలాగ ఇప్పుడు?" అని వాళ్ళు కంగారు పడ్డారు.

అయితే వాళ్ళకు తెలుసు- తమ గురువుగారు వెళ్ళింది అమరుకుని శరీరంలోకే. అందుకని వాళ్ళు వేషాలు మార్చుకొని గబగబా రాజసభకు వచ్చారు. "తత్త్వమసి, తత్త్వమసి, రాజన్" అంటూ పాటలు పాడటం మొదలెట్టారు.

"తత్త్వమసి" అనేది ఉపనిషత్తులలో వాక్యం.

"జీవాత్మ అయిన నువ్వే పరమాత్మవు" అని సూచిస్తున్న అద్వైత వాక్యం అది.

లౌకికంగా చూస్తే కూడా ఆ వాక్యానికి అర్థం "అదే నువ్వు" అని. "అయ్యో, నీ శరీరాన్ని నువ్వే కాల్చేయమని ఆదేశించావేమి? అది అసలు నువ్వే కదా?" అని రాజుగారి దేహంలో ఉన్న శంకరాచార్యులవారికి అనుచరులు సూచించారనమాట.

దాంతో శంకరులవారికి సంగతి అర్థమైంది. మరుక్షణం ఆయన అమరుకుడి దేహాన్ని వదిలి తన నిజ శరీరంలోనికి ప్రవేశించాడు. అమరుక మహారాజు మళ్ళీ ఓసారి మరణించాడు. తన ఆలోచన ఫలించలేదని గ్రహించిన రాణి విషయాన్ని ఇక పొడిగించలేదు. మళ్ళీ ఓసారి అమరుక మహారాజులవారికి అంత్యక్రియలు మొదలయ్యాయి.

అమరుకుని దేహంలో ఉన్నప్పుడు తనకు కలిగిన సంసారానుభవంతో శంకరులవారు అమరుక కావ్యాన్ని రచించారు. ఆ అనుభవం ఆధారంగా ఉభయభారతి అడిగిన ప్రశ్నలన్నిటికీ జవాబులివ్వగలిగారు. మండన మిశ్రుడిని ఓడించారు.

అమరుకుడి ఉదంతాన్ని పురస్కరించుకుని సంస్కృతంలో ఒక శ్లోకం చెప్పుకుంటారు.

కవి రమరుః కవి రమరః,

అన్యే కవయః కపయః |

కవిర్థి చోరః మయూరశ్చ,

చాపలమాత్రం పరం దధతే ||

"అమరుకుడే కవి. అతడు మాత్రమే 'అమరుడు'- అంటే చావు లేని వాడు.

మిగిలిన కవులు అసలు కవులే కాదు- వాళ్లంతా 'కపులు'- అంటే కోతులు!

ఇంకా ఎవరినైనా కవులు అనాలంటే 'చోరుడు, మయూరుడు' అన్న కవుల్ని కొద్దిగా అలా అనచ్చు.

వీళ్ళు కాక మిగిలిన కవులందరినీ ఏదో చాపల్యంతో అలా 'కవులు' అనచ్చేమోగానీ నిజానికి వాళ్ళెవ్వరూ అసలు కవులు కానే కారు!" అని దీని తాత్పర్యం. •



# అల్లం రొట్టె అబ్బాయి

ఆంగ్ల జానపద కథ

మూలం: 'జింజర్ బ్రెడ్ మ్యాన్' కథనం, సౌజన్యం: బెర్టీ, స్టోరీనోరీ డాట్ కాం



అనగా అనగా ఇంగ్లండులో ఒక అవ్వ, తాత, వాళ్లకో చిన్ని మనవడు ఉండేవాళ్ళు. ఒకరోజు ఉదయాన్నే అవ్వ 'మనవడి కోసం ఏం చేద్దాం?' అని ఆలోచించి, వాడికి నచ్చేట్లు గోధుమపిండిని సన్నగా ఒత్తి, మనిషిలాగే ఉన్న ఓ రొట్టె బొమ్మని చేసింది. వాడికి మైదాతో కళ్ళు, ముక్కు, రింగు రింగుల జుట్టు పెట్టి, చక్కగా ముడతలు ముడతలు ఉన్న బట్టలు కూడా వేసింది.

మనలాగా వాళ్ళకు పెనాలు ఉండవు కదా, అన్నీ నిప్పుల కుంపట్లే. కాలాల్సిన రొట్టెల్ని నిప్పుల

కుంపట్లలో వేసి మూత పెట్టేస్తారు. కొద్ది సేపటి తర్వాత మూత తీసి చూస్తే అవి తయారైపోయి ఉంటాయి. అట్లా అవ్వ ఈ రొట్టెని కూడా కుంపట్లో వేసి మూత పెట్టింది.



అయితే అంతలోనే ఆవిడకి తోటలో పని గుర్తుకొచ్చింది- మనవడితో "ఒరే! ఇవాళ్ల తోటలో చాలా పని ఉంది. తాత, నేను ఇద్దరం కలిసి చేసినా కూడా టైము చాలుతుందో, లేదో మరి. నువ్వు ఈ రొట్టె మాడిపోకుండా అట్లా ఓ కన్ను వేసి ఉంచావంటే, నేను పోయి నిశ్చింతగా తోట పని చేసుకుంటాను" అన్నది.

మనవడు మంచోడు. "నువ్వు పోయిరావ్వా, నేను చూసుకుంటాగా! రొట్టెని కాల్చటం అదేమంత పెద్ద పని?!" అన్నాడు.



దాంతో అవ్వ, తాత ఇద్దరూ పారా-తట్టా పట్టుకు పోయి, తోటలో ఆలుగడ్డలు త్రవ్వటం మొదలు పెట్టారు. పిల్లాడు కుంపటి ప్రక్కనే కళ్ళు మూసుకు కూర్చొని, తను మామూలుగా ఎప్పుడూ కనే పగటి కలల్నే మళ్ళీ కనసాగాడు.

అంతలో అకస్మాత్తుగా టప్పుమని ఏదో శబ్దం అయింది- మనవడు పిల్లాడు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసాడు: నిప్పుల కుంపటి తలుపు బార్లా

తెరిచి ఉన్నది. అందులో ఉండాల్సిన రొట్టె లేదు! క్రింద, నేలమీద బోర్లా పడి ఉన్నది!




మనవడు దాన్ని అందుకోబోయాడు. అయితే అంతలోనే అది- కాదు- వాడు..! ఆ అల్లం రొట్టె అబ్బాయి! వాడు లేచి పరుగు పెట్టాడు! తెరిచి ఉన్న తలుపువైపుకు పరుగెత్తాడు నేరుగా! పిల్లాడు చటుక్కున ముందుకు దూకాడు- తలుపు వేసేద్దామని. కానీ అల్లం రొట్టె అబ్బాయి వాడికంటే ముందే అక్కడికి చేరుకున్నాడు. తలుపు రెక్క పడేలోగానే దాని క్రిందినుండి జారి, అవతలికి పోయాడు. ఇంటి మెట్లు గబగబా దిగేసి, పిల్లాడు కళ్ళుమూసి తెరిచే సరికి రోడ్డు వైపుకు పరుగెత్తుతూ కనబడ్డాడు!

"అవ్వో! తాతో! వీడు పారిపోతున్నాడు! ఈ అల్లం రొట్టె అబ్బాయి పారిపోతున్నాడు, పట్టుకోండి!పట్టుకోండి!" అని అరుస్తూ వాడివెంట పరుగు పెట్టాడు మనవడు.

ఇంటి ముందు తోటలో పని చేసుకుంటున్న అవ్వ తాత "ఏమైంది?!" అని చూసే సరికే అల్లం రొట్టె పిల్లాడు రోడ్డు ఎక్కేసాడు. వెంటనే వాళ్ళు కూడా తమ చేతుల్లో ఉన్న పారలూ, పలుగులూ ప్రక్కన పడేసి మనవడి వెంట, ఆ అల్లం రొట్టె అబ్బాయి వెంట పడ్డారు.

అయినా పెద్దవాళ్ళు కదా, కొంచెం పరుగెత్తే సరికి వాళ్ళు కాస్తా అలిసిపోయి, ఆయాసపడటం మొదలు పెట్టారు. అక్కడ దారిలో ఉన్న ఓ కల్వర్టు మీద కూర్చుండిపోయారు. అల్లం రొట్టె అబ్బాయిని అందుకోలేని మనవడు కూడా నిరాశగా వెనక్కి వచ్చి వాళ్లకి అత్యవసర సేవలు

చేసాడు.

అట్లా వాళ్లనుండి తప్పించుకున్న అల్లం రొట్టె అబ్బాయి కులాసాగా ఈల వేసుకుంటూ రోడ్డమ్మట నడుస్తూ పోతుంటే అక్కడ బావి త్రవ్వుతూ కనబడ్డారు ఓ ఇద్దరు మనుషులు. వాళ్లకి అల్లం రొట్టె అబ్బాయిని చూస్తే ముచ్చట వేసింది-

"ఎటుపోతున్నావు బాబూ, నువ్వు అల్లం రొట్టె అబ్బాయీ?! అడిగారు వాళ్ళు.

"అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ

ఒక్క దెబ్బకు ఓడించాను

ఇదిగో, బావిని త్రవ్వే బావన్నలూ,

మీ ఇద్దర్నీ కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను!

జూ.....మ్ "




అని వాళ్లని దాటుకొని పరుగు పెట్టాడు అల్లం రొట్టె అబ్బాయి.

"ఓహో! అవునా?! అంత గొప్పవాడివా? మేమూ చూస్తాం!" అని వాళ్ళిద్దరూ తమ చేతుల్లోని పికాసులూ పారలూ ప్రక్కన పడేసి వాడి వెంట పడ్డారు.

అయితే అల్లం రొట్టె అబ్బాయి శరీరం తేలిక. వాడి కాళ్ళలో సత్తువ కూడా చాలా ఎక్కువ. దాంతో కొద్ది సేపట్లోనే వాళ్ళ చేతికి అందనంత దూరం వెళ్ళిపోయాడు వాడు. బావిని త్రవ్వేవాళ్లిద్దరూ కూడా అలిసిపోయి మధ్యదారిలో కూలబడ్డారు.

అల్లం రొట్టె అబ్బాయి అట్లా పోయి పోయి ఓ అడవిలోకి దూరాడు. వెంటనే వాడికో ఎలుగుబంటి ఎదురైంది. అది చేతులు చాపి వాడిని

అందుకోబోతూ "ఏయ్! అల్లం రొట్టె అబ్బాయి! ఎటు పోతున్నావు నువ్వు?" అన్నది.




వాడు దానికి అందకుండా తప్పించుకొని "అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ, బావిని త్రవ్వే బావన్నల్నీ ఒక్క దెబ్బకు ఓడించాను! నాకు నువ్వో లెక్కా, నిన్ను కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను! జూమ్..... " అంటూ పరుగు పెట్టాడు.

"అవునా? అంత గొప్పవాడివా? నీ పని చెప్తాను ఆగు!" అంటూ వాడి వెంట పడింది ఎలుగుబంటి.

"ఓసోస్! చాలా చూసాను. రా! నన్ను పట్టుకో!" అంటూ పరుగెత్తిన అల్లం రొట్టె అబ్బాయిని అందుకోలేక, త్వరలోనే చతికిలబడింది ఎలుగుబంటి "అయ్యో! అనవసరంగా వీడి వెంట పడ్డానే, ఈ మాత్రం పరుగెత్తితే ఇంకే జంతువైనా దొరికిపోయేది గదా, నాకు!" అనుకుంటూ.

దాన్ని కూడా ఓడించే సరికి అల్లం రొట్టె అబ్బాయికి చాలా సంతోషం వేసింది. వాడు కులాసాగా పాటలు పాడుకుంటూ, అటూ ఇటూ చూసుకుంటూ పోసాగాడు.

ఈసారి వాడికి ఓ తోడేలు ఎదురైంది. అది వాడిని అందుకునేందుకు చెయ్యి చాపుతూ "ఓయ్! ఓయ్! ఎటుపోతున్నావోయ్! అందాల అల్లపు రొట్టె అబ్బాయీ?" అంది.

"అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ, బావిని త్రవ్వే బావన్నల్నీ, దుబ్బ ఎలుగునీ
ఒక్క దెబ్బకు ఓడించాను!
నాకు నువ్వో లెక్కా, నిన్ను కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను చూడు! జూ...మ్.."

అంటూ దానికి దొరక్కుండా తప్పించుకుపోయాడు అల్లపు రొట్టె అబ్బాయి.



"ఓహో! అంత తురుంగాడివేమి?! నేను నిన్ను పట్టుకుంటా చూడు!" అని వగరుస్తూ వెంటపడింది తోడేలు.

కానీ ఎంత పరుగెత్తినా అల్లం రొట్టె అబ్బాయి మటుకు దాని చేతికి చిక్కలేదు. చివరికి అదికూడా విరమించుకొని, తన దారిన తాను పోయింది.

దాంతో అల్లం రొట్టె అబ్బాయికి చాలా గర్వం అనిపించింది.

"ప్రపంచంలో ఎవ్వరూ.. నన్నింక పట్టుకోలేరూ.." అని గట్టిగా పాటలు పాడుకుంటూ పోయాడు వాడు.

అంతలో వాడికో నక్క కనిపించింది. ఓ ముళ్ళ కంచెకి ఇవతలగా ముడుచుకొని పడుకొని ఉన్నది అది. జ్వరం వచ్చినట్లుంది; ముసలి గొంతు వణుకుతుండగా

"ఎటు పోతున్నావబ్బీ!

అల్లం రొట్టె అబ్బాయీ?" అన్నదది.

"అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ, బావిని త్రవ్వే బావన్నల్నీ, దుబ్బ ఎలుగునీ, కోరపళ్ల తోడేలుగాడినీ కూడా ఒక్క దెబ్బకు ఓడించాను! నాకు నువ్వో లెక్కా, నిన్ను కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను చూడు! జుయ్..." అంటూ పారిపోబోయాడు వాడు కానీ-

"అంత గడగడా మాట్లాడితే

అర్థం ఎట్లా అవుతుంది,

అల్లం రొట్టె అబ్బాయీ?

నాకేం వినబడలేదు-

నువ్వేమన్నావు?" అన్నది నక్క, కదలకుండానే.

దాంతో అల్లం రొట్టె అబ్బాయి జోరు కొంచెం తగ్గింది:

"అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ, బావిని త్రవ్వే బావన్నల్నీ, దుబ్బ ఎలుగునీ, కోరపళ్ల తోడేలుగాడినీ కూడా ఒక్క దెబ్బకు ఓడించాను! నాకు నువ్వో లెక్కా, నిన్ను కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను చూడు!" గొంతు పెంచి, ఇంకొంచెం గట్టిగా అరిచి, నక్క కదులుతుందేమో అని జాగ్రత్తగా నిక్కి చూసాడు వాడు.

"ఆఁ..? ఏమంటున్నావు?

అవ్వనా?" అన్నది నక్క, ఒక కన్ను తెరిచి, ఇంకా కదలకుండానే.

"ఏదోలే, పో.. నీ దారిన నువ్వు పో... నువ్వు గొణుక్కునేదేమీ ఎలాగూ నాకు వినబడదులే గానీ, నీ దారిన నువ్వు పో.. గొంతులేని వెర్రి రొట్టెముక్కా!" అని గొణిగిందది.




అల్లం ముక్క అబ్బాయికి కోపం వచ్చింది. గొంతు పెంచి, నక్క చెవి దగ్గర నోరు పెట్టి, చాలా గట్టిగా "అవ్వనూ, తాతనూ, వాళ్లిద్దరి మనవడినీ, బావిని త్రవ్వే బావన్నల్నీ, దుబ్బ ఎలుగునీ, కోరపళ్ల తోడేలుగాడినీ కూడా ఒక్క దెబ్బకు ఓడించాను! నాకు నువ్వో లెక్కా, నిన్ను కూడా ఇప్పుడే ఓడించేస్తాను నేను చూడు!" అని అరవబోయాడు-

కానీ వాడి మాటలు పూర్తవ్వనిస్తేగా? నక్క చటుక్కున తల తిప్పి, లటుక్కున వాడిని కరిచి పట్టుకొని, ఆపైన మెల్లగా కరకరామనుకుంటూ తినేసింది!!

"అయ్యో! ఎంత ఘోరం జరిగింది?! అల్లం రొట్టె అబ్బాయికి, పాపం!" అని బాధ పడుతున్నారా? అదేమీ లేదు. "అల్లం రొట్టె ఎంత బాగుంటుందంటే, దాన్ని తినకుండా ఉండటం అసలు ఎవ్వరి తరమూ కాదు. చూసినవాళ్ల నోర్లన్నీ ఊరతాయి. నక్కకు మాత్రం నోరూరదా? నాకు దొరికితే నేనూ తినేస్తాను మరి!" ...

నిజం చెప్పండి: మీరూ అంతే! కదూ?!

**ఓ మాట...**

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. ఈసారైతే బొమ్మలు వేసిన వాళ్ళు కూడా పిల్లలే! వాళ్లంతా అనంతపురం రాధా స్కూల్‌లో ఏడు-ఎనిమిది-తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అట్లాగ, అనుకుంటే మీరూ బొమ్మలు వేయచ్చు; మీరూ కథలు రాయచ్చు!

పిల్లలను కలవటం, వాళ్ల చేత తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, ఇష్టపడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి! ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలుపంచుకోండి. బాగా చదవండి! బాగా గీయండి! బాగా రాయండి! నవ్వండి! ఆలోచించండి! చక్కగా పాడండి! మంచి పౌరులుగా ఎదగండి!

**పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !**




# అలిస్సా

ఆంగ్ల కథ

మూలం: సి.జె.మూర్.

అనుసరణ : నారాయణ, కొత్తపల్లి బృందం.

అలిస్సా కూర్చొని ఏదో చదువుకుంటోంది. అంతలో వాళ్ల నాన్న పిలిచాడు: "అలిస్సా! అలిస్సా! ఎక్కడున్నావు?" అంటూ.

అలిస్సా చటుక్కున లేచి గేటు దగ్గరికి పరుగెత్తింది "వస్తున్నా!" అంటూ.

గేటు ముందు ఆకుపచ్చ కారొకటి ఆగి ఉన్నది. దానిముందు పెద్ద పెద్ద మీసాలవాడు ఒకాయన. అలిస్సా వాళ్ల నాన్న ఆ మీసాలవాడితో ఏదో మాట్లాడుతున్నాడు.

అలిస్సా రాగానే "ఇదిగో, ఇదే అలిస్సా. రోజంతా చదువుతూనే ఉంటుంది!" అన్నాడు నాన్న, నవ్వుతూ. మీసాలవాడు కూడా ఖళపెళా నవ్వాడు.

"అలిస్సా," చెప్పాడు నాన్న- "ఈయన మా ఫ్రెండు. నగరంలో నీకోసం పని చూసి పెట్టాడు. ఊళ్ళో నీకు తగిన పనులు ఉండట్లేదు కదా. అందుకని నువ్వు వెంటనే బయలుదేరి వెళ్ళాలి, ఈయనతో. త్వరగా

బట్టలు సర్దుకో మరి" అని.

మీసాలవాడు అలిస్సాకేసి చూసి నవ్వాడు. పాన్ తినీ తినీ అతని పళ్ళు ఎర్రగా గార పట్టి ఉన్నాయి. "నీకు ఎంత వయసు?" అడిగాడు అతను.

"పన్నెండేళ్ళు" చెప్పింది అలిస్సా.

మీసాలవాడు మళ్ళీ ఇంకోసారి నవ్వాడు ఖళ్ళపెళా. అలిస్సాకి అతనంటే ఎందుకనో ఇష్టం కాలేదు. అతని వెంట వెళ్ళటం అస్సలు నచ్చలేదు. తమ ఊళ్ళోనే బడి ఉంది. ఆ బడికి పోదామని ఉంది అలిస్సాకు. ఆ బడి పరిసరాలంటే ఆ పాపకు చాలా ఇష్టం. చదవటం అంటే తనకు చాలా ఇష్టం ఎలాగూ.

"ఇంక పో మరి. నీ బట్టలూ అవీ సర్దుతోంది చూడు, మీ అమ్మ. నువ్వు వెంటనే బయలుదేరాల్సి ఉంటుంది. పో, తయారవు!" అన్నాడు నాన్న.

మీసాలవాడు జేబులోంచి నోట్ల కట్ట ఒకటి తీసి నాన్నకు ఇచ్చాడు.

నాన్న ముఖం వెలిగిపోయింది ఆ డబ్బుల్ని చూసి. అతను దాన్ని లెక్క పెట్టుకుని, గర్వంగానూ, సంతోషంగానూ నవ్వాడు. ఆ మీసాలవాడు కూడా నవ్వాడు. అలిస్సాకు మటుకు కోపంగాను, భయంగాను అనిపించింది. "నాకు ఇతనితో వెళ్ళాలని లేదు" అని చెబుదామనిపించింది. అయినా నాన్న మాట తను కాదనటానికి లేదు.

***



అలిస్సా, మీసాలవాడు ఇద్దరూ నగరానికి వచ్చారు. మీసాలవాడు తనని ఎవరింటికో తీసుకెళ్ళి, వాళ్ల కాలింగ్ బెల్ నొక్కాడు. కొద్ది సేపటికి ఆ యింటి యజమాని తలుపు తెరిచి చూసాడు.

మీసాలవాడు అతనికి గుడ్మార్నింగ్ చెప్పాడు.

ఇద్దరూ కొద్ది సేపు ఏవో మాట్లాడుకున్నారు. అలిస్సా ఇద్దరినీ చూస్తూ నిలబడింది.

ఆ ఇంటి యజమాని సన్నగా, పొడుగ్గా ఉన్నాడు. అలిస్సాను వాళ్ల ఇంటిలోపలికి తీసుకెళ్ళి, మెట్ల క్రింద త్రిభుజంలాగా ఉన్న గది చూపించాడు: "ఇదిగో- ఇదే, నీ గది!" అని చెప్పాడు.

అలిస్సా ఆ గదిలోకి వెళ్ళి చూసుకున్నది. చిన్నగా, చీకటిగా ఉంది ఆ గది. ఎత్తుగా నిలబడితే పైనున్న మెట్లకు కొట్టుకుంటుంది తల! ఆ పాప బయటికి తొంగి చూసే సరికి మీసాలవాడు వెళ్ళిపోతున్నాడు!

మరునాడు తెల్లవారు జామున యజమాని వచ్చి నిద్రలేపాడు అలిస్సాని. "ఇదిగో, ఈ పాపే, నిన్న నేను చెప్పిన- అలిస్సా. ఈ పాపకు ఎప్పుడూ చదువుతూ ఉండటం అంటే ఇష్టం" అంటూ పరిచయం చేసాడు ఇంటావిడకు. వెంటనే ఇద్దరూ నవ్వారు గట్టిగా.

అకస్మాత్తుగా ఆ ఇంటావిడ అలిస్సా ముఖంలో ముఖం పెట్టి అరిచింది: "నువ్విక్కడ చదువుకోబోవట్లేదు! అర్థ-మైందా? నువ్వు ఇక్కడంతా కసువు ఊడుస్తావు, గిన్నెలు తోముతావు, బట్టలు ఉతుకుతావు! కూర్చోబెట్టి చదివించేందుకు కాదు, నిన్ను పిలిపించుకున్నది! ఊరికే ఉంచుకొని తిండి పెట్టేందుకు ఇది ధర్మసత్రం కాదు! నువ్వు ఈ ఇల్లు మొత్తాన్నీ శుభ్రంగా ఉంచాలి, వంట చేయాలి, బట్టలు ఉతకాలి!" అని.



ఆ రోజు నుండీ ప్రతిరోజూ ఆమె అలిస్సామీద అరుస్తూనే ఉంది. రోజుకు పదిహేను గంటలు పనిచేసేది అలిస్సా. పదిహేను గంటల్లో పది గంటలు తిట్లు తింటూనే ఉండేది. తనకి ఏమాత్రం సంతోషం లేదిక్కడ. పని ఐపోయి తన 'గది'లోకి

వచ్చాక, రోజూ ఒకటే ఏడ్చేది.

ఇట్లా కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజున యజమాని చెప్పాడు: "బట్టలు సర్దుకో. నువ్వు మాకు ఇంక అవసరం లేదు. యజమానమ్మకు నువ్వు నచ్చటంలేదు" అని.



ఆ రోజున యజమాని అలిస్సాను నగరంలో ఉన్న ఓ బట్టల దుకాణానికి తీసుకెళ్ళాడు. దుకాణపు వోనరు- చాలా దుబ్బగా ఉంది- అలిస్సాని నొక్కి నొక్కి చూసాక, తన బీరువాలోంచి నోట్ల కట్ట ఒకటి తీసి ఇచ్చింది యజమానికి. యజమాని ఇక అలిస్సా కేసి చూడను కూడా చూడకుండా బయటికి వెళ్ళిపోయాడు.

***

అలిస్సాతో పాటు పనిచేసే పిల్లలు ఆ దుకాణంలో ఇంకో ఐదుగురు ఉండేవాళ్ళు. వాళ్లంతా దుకాణాన్ని ఆనుకునే ఉన్న ఓ చిన్న, చీకటి గదిలో నివసించేవాళ్ళు; అక్కడే బట్టలు కుట్టేవాళ్లు. తెల్లవారి దుకాణం తెరిచినప్పటినుండి, రాత్రి తలుపులు మూసేసే వరకూ తెరిపి లేకుండా పని చేసేవాళ్ళు అందరూ. మధ్యాహ్నం భోజనం తర్వాత వాళ్లకు ఒక పది నిముషాలు ఖాళీ దొరికేది. అంతే. రాత్రి అయ్యాక ఆ గదిలోనే నేలమీద పడుకొని ఎవరికివాళ్ళు నిద్రపోయేవాళ్ళు.

లావుపాటి ఆవిడ ప్రతి నెలా వాళ్లకు కొంత డబ్బు ఇచ్చేది. మిగిలిన పిల్లలు ఆ డబ్బుతో బట్టలు, సబ్బులు కొనుక్కునేవాళ్ళు. అలిస్సా మాత్రం ప్రతినెలా ఒక పుస్తకం కొనుక్కునేది. మధ్యాహ్న భోజనం తర్వాత

ఖాళీలో ఆమె తన పుస్తకం చదువుకునేది.

ఒకసారి యజమానురాలు అది చూసి చాలా ఆశ్చర్యపోయింది. తన దగ్గర పని చేసే పిల్లలెవ్వరికీ చదువు రాదు! "నీకు చదవటం వచ్చా? అంకెలు లెక్కపెట్టటం?" అని అడిగింది.



"వచ్చు" అని చెప్పింది అలిస్సా.

"అయితే రా, మరి. నువ్వు ఇకనుండి మన దుకాణంలో పని చేస్తావు" అని దుకాణంలోకి పిల్చుకుపోయిందామె, అలిస్సాని.

***

అలిస్సాకి దుకాణంలో పని చేయటం నచ్చింది. దుకాణం పెద్దగా ఉంటుంది. గాలీ వెలుతురూ బాగా వస్తాయి. డబ్బున్న ఆడవాళ్ళు చాలామంది దుకాణానికి వస్తూంటారు. ఖరీదైన బట్టలు కొనుక్కుంటూ ఉంటారు. వాళ్ళకు కోరిన బట్టలు చూపించటం అలిస్సా పని. వాళ్ళు వచ్చినప్పుడు మర్యాదగా నవ్వటం, వాళ్ళతో చక్కగా మాట్లాడి మరింత ఖరీదైన బట్టలు కొనిపించటం అలిస్సాకు సులభంగానే వచ్చాయి.

పొడుగ్గా, నాజూకుగా ఉండే ఆవిడ ఒకావిడ తరచు వస్తుండేది వాళ్ల దుకాణానికి. ఒకటి రెండుసార్లు చూసేసరికి, ఆమెకు ఎలాంటి బట్టలు నచ్చుతాయో అలిస్సాకు అర్థమైపోయింది. ఇక ఆ తర్వాత ఆమె ఎప్పుడు దుకాణానికి వచ్చినా ఆమెకు నచ్చే బట్టల్ని నేరుగా తీసుకొచ్చి చూపించటం మొదలు పెట్టింది. అట్లా ఆవిడ అలిస్సాని గుర్తించటం జరిగింది.

ఒకరోజున ఆ పొడుగావిడ వెళ్తూ వెళ్తూ తన పర్సును దుకాణంలోనే మర్చిపోయింది.

బట్టలు సర్దుతూన్న అలిస్సా దాన్ని చూడగానే గుర్తు పట్టి, "మేడం! మీ పర్సు!" అని అరుస్తూ రోడ్డు మీదికి పరుగెత్తింది.



"ఇదిగో మేడం! దుకాణంలో మీ పర్సును మర్చిపోయారు!" అని దాన్ని ఆమెకు అందించింది.

"ఓ! నిజమే. థాంక్యూ!" అని ఆమె పర్సును అందుకొని, ఆ పర్సులోంచి కొన్ని డబ్బులు తీసి అలిస్సాకు ఇవ్వబోయింది.

అయితే ఆ సరికే అలిస్సా దుకాణం చేరుకున్నది. దుకాణంలోకి అడుగు పెట్టగానే యజమానురాలు ఆమెను నిలబెట్టి అరిచింది: "ఇంకెప్పుడూ దుకాణం విడిచిపెట్టి బయటికి అడుగు పెట్టకు, చెబుతున్నాను! నేను నీకోసం చాలా డబ్బులు వెచ్చిస్తున్నాను- ఇంతింత జీతం ఇస్తున్నాను. ఇంత ఖర్చు పెట్టేది నువ్వు పనిచేస్తావని. అంతేగాని ఊరికే రోడ్లమీద పరుగెత్తుతావని కాదు!"

అలిస్సాకు చాలా కోపం వచ్చింది.

"నువ్వు నాకు చాలా డబ్బులు ఇస్తున్నావా?! ఎక్కడిచ్చావు?! నన్నిక్కడ బానిసలాగా ఉంచుకున్నావు!" అని అరిచింది.

"కృతజ్ఞత లేని పిల్లా! నేను నీకు ఏమేం చేసానో అన్నీ మర్చిపోయావా? నేను నీకు పడుకునే చోటు చూపించాను, తినేందుకు తిండి పెట్టాను, చేతికి డబ్బులు ఇచ్చాను. ఇంకా ఏం కావాలి నీకు? ఆశకి అంతు ఉండద్దా?" అరిచింది యజమానురాలు.

"అవును! కావాలి! నాకు పూర్తి జీతం డబ్బులు కావాలి! నేను బడికి పోవాలి!"

ఏడుస్తూనే అరిచింది అలిస్సా.

అంతలోనే "ఆగండి!" అన్నదో గొంతు. చూస్తే అది ఆ పొడుగాటి మేడం.

"అలిస్సా కృతజ్ఞత లేని పిల్ల కాదు" దుకాణపు యజమానురాలికి చెప్పింది ఆ మేడం. "ఈమె చాలా నిజాయితీ గల పిల్ల" అని.



వెంటనే అలిస్సా వైపుకు తిరిగి "నీకు ఇక్కడ పని చేస్తుంటే సంతోషంగా లేదా?" అన్నది.

"నేను బడికి పోతాను. చదువుకుంటాను" అనేసింది అలిస్సా, ఏడుస్తూ.

ఆవిడ ముందుకొచ్చి అలిస్సా భుజం మీద చేయివేసి, దుకాణపు యజమానితో చెప్పింది గట్టిగా- "క్షమించండి. ఇకమీద అలిస్సా మీ దుకాణంలో పని చెయ్యదు. మా ఇంట్లో ఉంటుంది, నాతో పాటు. మా ఇంట్లో ఉంటూ, రోజూ బడికి పోయి చక్కగా చదువుకుంటుంది" అని.

"అది జరగాలంటే మీరు నాకు చాలా డబ్బులు ఇవ్వాల్సి ఉంటుంది!" అరిచింది దుకాణపు యజమాని.

"లేదు. ఏమీ ఇచ్చేది లేదు. అలిస్సా బానిస కాదు. తనకీ కొన్ని హక్కులు ఉన్నాయి" ప్రశాంతంగా చెప్పింది మేడం. "నీ వస్తువులన్నీ తీసుకో, అలిస్సా. మనం మన ఇంటికి వెళ్దాం. ఇక వీళ్లెవరూ నిన్నేమీ చెయ్యలేరు. రేపే నువ్వు బడిలో చేరతావు" అన్నది అలిస్సాతో.

***

అలిస్సా బడిలో చేరింది. చాలా పట్టుదలతోటి చదివింది. కాలేజీకి, అటుపైన విశ్వవిద్యాలయానికీ వెళ్ళింది. సామాజిక కార్యకర్త అయి, తను కూడా అనేకమంది పిల్లల జీవితాల్లోకి వెలుగు తెచ్చింది.

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**భక్తులు, రంగు, శివరాత్రి, ధర్మం, అమ్మమ్మ, తాతయ్య, స్నేహితుడు, అవకాశం, గంగానది, సరస్వతి, డబ్బులు, పుట్టినరోజు, వెంగళప్ప, దెబ్బ, బడి, చిలుక, గమనిక, కొత్తపల్లి, మహాసభ, పుస్తకాలు:-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ని | కా | న | ర | లు | రా | గా | ర | చి | త్త | న |
| వ | మ్మ | లు | ట్టా | డ | రం | స్నే | ల్లి | జా | త | లు | అ |
| కా | న | మ్మ | న | బ్బు | డి | హి | ప | వె | డ | న | క |
| శం | క | భ | క్తు | లు | రో | తు | త్త | త | పు | ని | మ |
| స | బ | గా | లు | కా | శి | డు | కొ | మ | మ | ళ | హా |
| క | ర | లు | బ | స్త | చి | ర | డు | గ | త్త | రో | స |
| ట్టా | శి | స్వ | డి | పు | ట్టి | న | రో | జా | ళ | పు | భ |
| డి | న | ర | తి | బ | ర | చి | డి | య్యా | త | తా | ర |
| శి | వ | రా | త్రి | త | శి | త్త | ధ | ర్మం | చి | మ్మ | ఫి |
| ట్లా | త్త | న | ల | గా | ల్లి | న | మ | చి | బ్బా | దె | న |
| మ | రో | లు | ర | ట్టా | రం | గు | అ | దా | ర | డి | ళ |
| వెం | గ | ళ | ప్ప | త్త | బ | న | ర | ది | న | గా | గం |

"విద్యా ధనం సర్వ ధన ప్రధానం" అన్ని ధనాలలోనూ విద్యా ధనం గొప్పది.

# పదరంగం-96

నిర్వహణ : డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం




**అడ్డం:**

1. చేపల్ని పట్టడానికి ఉపయోగించే సాధనం (2)
2. 'ఆగమనం' లో చివరి అక్షరం మాయమైంది. (3)
4. 'భాగ్యనగరం' లో బరువుని సూచించే పదం (2)
5. 'ఎద్దు' కి మరో పేరు (3)
6. తెలుగులో 'Cotton' (2)
7. 'వ్యాఘ్రం', వాడుక భాషలో (2)
8. నీవు తిరగాల్సింది 'ఈ మలుపు' కాదు (4)
10. ఢిల్లీకి మరో పేరు. ఈ పేరులో ఏనుగు ఉంది(5)

**నిలువు:**

1. 'అడవి' కి మరో పేరు (2)
2. 'మొదలు' ని ఇలా కూడా అంటారు (3)
3. తమిళనాడులో 'మామల్లపురం' అని పిలిచే ఈ పురాన్ని, పూర్వం బలి చక్రవర్తి పరిపాలించాడట. అందుకే, పేరులో కూడా 'బలి' ఉంటుంది (6)
4. తెలుగులో లాంగ్వేజ్ (2)
5. తెలుగులో Profession ! (2)
6. 'పదాలు' కి ఏకవచనం (2)
7. చింత రుచి? (3)
8. వారసత్వంగా వచ్చే సంపద (2)
9. 'మనాలి' లో చివరి అక్షరం మాయమైంది (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడిపేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-98ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రింటు పుస్తకాలను ఆన్‌లైన్లో ఆర్డరు చేయటం, చందాలు కట్టటం చాలా సులువు! క్రెడిట్ కార్డుల ద్వారాను, డెబిట్ కార్డుల ద్వారాను, నెట్ బ్యాంకింగ్ ద్వారా కూడా కొత్తపల్లికై డబ్బులు చెల్లించవచ్చు! అక్కౌంటు నెంబర్లు వెతుక్కునే పని కూడా లేదు! సందర్శించండి: **http://www.instamojo.com/kottapalli**



**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**

కథల పుస్తకాలండీ కథల పుస్తకాలు! పిల్లలు చెప్పిన కథలున్నాయ్! పెద్దలు వ్రాసిన కథలున్నాయ్! రంగురంగుల బొమ్మలున్నాయ్! అక్కడక్కడా జోకులున్నాయ్! ఆన్‌లైన్‌లో దొరుకుతున్నాయ్! ఇప్పుడే కొనండి! అందరికీ చెప్పండి!!!



**రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:**

**రూ. 360/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of India
Dharmavaram Branch
IFSC: SBIN0020902

(బ్యాంకు వారి నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) (పోస్టేజి రూ 50 అదనం) |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 11 | 11 | 220 |
| 2 | 2012 Set | 12 | 12 | 240 |
| 3 | 2013 Set | 7 | 3 | 175 |
| 4 | 2014 Set | 10 | 403 | 250 |
| 5 | 2015 Set | 7 | 914 | 175 |
| 6 | 2016 Set | 8 | 1178 | 200 |
| 7 | 2017 Set | 7 | 1450 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9490180695. ఇ-మెయిలు : team@kottapalli.in

BC1

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 08/01/2018 Postal Regn No: HDP/008/2018-2020

# అయ్యో ! తెలుగు రాదే, ఎలాగ?!

"కథలమ్మా కథలు! కథలమ్మా కథలు! రకరకాల కథలు! తెలుగు పిల్లల కథలు!"

"ఏం కథలు బాబూ? మా పిల్లలకు తెలుగు చదవటం రాదు. ఇంగ్లీషు కథలు ఏమన్నా ఉన్నాయా, నీ దగ్గర?"

"ఇంగ్లీషువైతే వేరేవాళ్ళ దగ్గర దొరుకుతాయండి. నా దగ్గర ఉన్న సరుకంతా తెలుగువాళ్ల కోసమే. ఏం, మీ పిల్లలు తెలుగువాళ్ళు కారాండీ? పాపం, వాళ్ళకి కొంచెం తెలుగు నేర్పించకపోయారూ?"

"ఏమో నాయనా! మా వాళ్లకైతే ఇంగ్లీషు అంటేనే ఇష్టం. ఆ ఇంగ్లీషు నేర్చుకునేసరికే వాళ్ల తల ప్రాణం తోకకొచ్చింది. ఇంక తెలుగు ఎక్కడ నేర్చుకుంటారు?"

"అవున్లెండి, పాపం. కానీ నా దగ్గర ఉన్నవి తెలుగు కథలేనండి. మీకు పనికిరావు."

"ఏదీ, ఓసారి చూడనియ్యి- పుస్తకం బానే ఉన్నట్టుందయ్యా, కాయితం, రంగులు అదీనీ- దీన్ని పాపం ఇంగ్లీషులో అచ్చెయ్యకపోయారూ? మీకూ కొంచెం అమ్మకాలుండేవి గద! ఇప్పుడు పిల్లలంతా ఇంగ్లీషు బళ్లలో చదివీ చదివీ, తెలుగుని పూర్తిగా మరచే పోతున్నారుగా?"

"అవునండీ, అందుకనే వీటిని తెలుగులో మాత్రమే అచ్చేస్తున్నాం. మీ పిల్లలకి ఈ కథలు కావాలంటే వాళ్ళు తెలుగు నేర్చుకోవాల్సిందే, తప్పదు. లేకపోతే ఇంకో మార్గం ఉంది- మీరు వాళ్లకి చదివి పెట్టచ్చు-"

"అవున్లే, అట్లాగైనా వాళ్లకి మెల్లగా తెలుగు చదవటం వస్తుందేమో, చూస్తాను. కథలు చదవటం కోసమన్నా వాళ్ళు తెలుగు నేర్చుకుంటారేమో"

"తప్పకుండా నేర్చుకుంటారు చూడండి. అదేమంత బ్రహ్మవిద్య? తలచుకుంటే వాళ్ళు ఒక్కరోజులో నేర్చుకోగలరు. కథల్లో మాయ మీకు తెలీనిదా? మీరు చిన్నప్పుడు ఎన్ని కథల పుస్తకాలు చదవలేదు?"

"అవును నాయనా! ఇప్పుడు తెలుగు పుస్తకాలే కరువైపోతున్నాయి"

"ఏమీ లేదండీ! ఆదరించేవాళ్లు ఉంటే భాష చటుక్కున పుంజుకుంటుంది. ఏం చేసినా తెలుగులో అర్థమైనంత బాగా పరాయి భాషలో ఎంతమందికి అర్థమౌతుంది, చెప్పండి? ఏదో ఒక మాయ చెయ్యాల్సిందేనండీ. మీ పిల్లలకి 'తెలుగు రాదు' అని ఊరుకోకండి. ఏదో ఒకటి చేసి వాళ్ళ భాషని వాళ్ళకి ఇవ్వాలి- లేకపోతే కుదరదు."

"అంతేనంటావా?"

"అంతేనండీ- వేరే మార్గం లేదు. మాతృభాష తర్వాతే, వేరే ఏదైనా."

"Kottapalli" Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M126 |
| పుస్తకం పేరు | కొత్తపల్లి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 12 |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |